# మానవుడి పాట్లు

యుద్ధం ముగిసిన మరుసటి సంవత్సరమది. మార్చి మాసాంతంలో, అజోవ్ సముద్రతీరంనుంచి, వేడిగాడ్పులు వీచటం ప్రారంభమైంది. నదీసమీపంలో గడ్డకట్టుకపోయిన మంచు కరగిపోయి, విపరీతంగా ప్రవహించి, ఏవిధమయిన ప్రయాణం చేయటానికి వీలుకానంత ఘోరంగా తయారయ్యాయి రోడ్లన్నీ......

పరిస్థితు లీ విధంగా వున్నప్పటికీ, బుఖనవస్కయాలోని 'స్టనిట్సా' గ్రామానికి తప్పనిసరిగా నేను వెళ్ళవలసి వచ్చింది. వెళ్ళవలసిన దూరం 60 మైళ్ళకంటె ఎక్కువ లేకపోయినా, అదేదో దూరప్రయాణంలాగే కనపడింది. రెండుగుర్రాల బండిలో బయల్దేరాం, నేనూ నా మిత్రుడూకలసి. అప్పటి కింకా సూర్యోదయం కాలేదు...గుర్రాలు మంచి బలమైనవే అయినా మంచులో, ఇంచుమించుగా సగంవరకూ కూరుకుపోయిన బండిచక్రాల్ని లాగలేక ఒగురుస్తున్నాయ్...వాటికి మరీ కష్టమైనచోటుల్లో మేమే, క్రిందకుదిగి నడిచాం. నడుస్తున్నప్పుడు, బూట్ల అడుగులలో మంచుదూరిపోయి బూట్లు

రెట్టింపు బరువైపోయాయ్. దానికితోడు ప్రవహిస్తున్న ఆ [illegible]ంచులో వేసిన అడుగు లోపలికంటా కూరుకుపోయి, తీయటం యమయాతనైంది. ఉదయాన వీచేగాలి చల్లగానే వున్నా గుఱ్ఱాల చెమటతోకలిసి, పీల్చితే మత్తుగావుంది. అయినప్పటికీ ముందుకు సాగిపోయాం...ఆరుగంటలు ఈ నరకబాధను భరిస్తూ 'ఎలంకా' నదిదగ్గరికి చేరుకునేసరికి తల ప్రాణం తోకకువచ్చింది. తీరాచూస్తే మేం వచ్చింది 30 మైళ్లు! అంటే ఇంకా సగందూరం వెళ్లాలన్నమాట! అబ్బ!

'మొఖవస్కీ' గ్రామందగ్గరున్న ఆ చిన్ననది సాధారణంగా ఎప్పుడూ ఎండిపోయేవున్నా, ఇప్పుడు బాగా పొంగి, మైలు వెడల్పుతో-ప్రవహిస్తూ, అక్కడున్న బయళ్ళనన్నిటినీ ముంచేసింది. మేం అవతలిఒడ్డుకు వెళ్ళాలి. నదిని దాటటానికి అక్కడ ఒక పాడైపోయిన ఒక పాతదోనెతప్ప మరేమీలేదు. ఆ డొక్కుదోనెలో ఇద్దరు, ముగ్గురుఎక్కినా, మునిగిపోయేట్లుగా వుంది. నదికి అవతలిఒడ్డున ఒక 'షెడ్డు' కనిపించింది. అది బహుశా ఉమ్మడి వ్యవసాయక్షేత్రానిది కావచ్చు. ఆ 'షెడ్డు'లో ఒక పాత 'జీప్'కారు వుంది. అది మా కోసమే వచ్చినట్లుంది. ఆ జీప్‌డ్రైవర్ని పిలిస్తే అతను ఇవతలివైపుకు వచ్చాడు. అతను వచ్చేలోపలే మేంవచ్చిన గుఱ్ఱాలబండిని పంపించేశాం. నా మిత్రుడు, మా సామాన్లతో గట్టుమీద కూర్చున్నాడు...నేనూ, డ్రైవరూ దోనెలో యెక్కాం... ప్రవాహంలో దానిష్టంవచ్చినట్టు పోతోంది దోనె. దాని చెక్కలన్నీ, పాతవైపోయి ఊడిపోతున్నాయ్. ఆ సందు

ల్లోంచి, కెరటాలుకొడుతున్న నీళ్లు లోపలికొచ్చి చేరుకొంటు న్నాయి...దానికి తోడు, మా యిద్దరిబరువు యెక్కువైపోయి. ఆ దోనె అప్పటికే సగంపైగా నీళ్ళల్లో మునిగిపోయింది. పెద్ద కెరటంవచ్చి కొట్టినప్పుడల్లా, అది ఇటూ అటూ ఊగిపో తూంటే, ఒడ్డు చేరుకుంటామనే ఆశ నాలో ఇగిరిపోయి గుండె కొట్టుకోటం యెక్కువైపోయింది. అరచేతిలో ప్రాణాలు పెట్టుకొని, అలాగే కూర్చున్నాం. మేం అవతలిఒడ్డు చేరేటప్ప టికి గంటపట్టింది. తీరం చేరుకునేసరికి గుండె తేలికై హాయిగా గాలి పీల్చుకున్నా. డ్రైవర్ గ్రామం దగ్గరున్న 'జీప్'ను తీసు కొచ్చి, తిరిగి దోనెదగ్గరకు వెళ్లాడు. దోనెలో కూర్చుంటూ అరుస్తున్నాడతను "ఈ డొక్కుదోనె నీళ్ళల్లో ముక్కలవ కుండా వుంటే రెండుగంటల్లో మీా స్నేహితుణ్ణి ఇక్కడకు తెస్తాను. అంతకన్నా ముందు వస్తామనిమాత్రం అనుకోవద్దు" అంటూ తెడ్డుని నీళ్ళల్లోపడేసి తోసుకుంటూ పోతున్నాడు. నేను వెనక్కుతిరిగి చూశాను. గ్రామం దూరంగానేవుంది. ఆ చుట్టుప్రక్కలంతా నిర్మానుష్యంగావుండి, ఏ అలజడీలేక, ఎడారి వాతావరణాన్ని గుర్తుతెచ్చింది. కెరటాలతో యుద్ధం చేస్తూ ముందుకు సాగిపోతున్న ఆ డ్రైవర్ ఇంకా మసక మసకగా కనపిస్తోనే వున్నాడు. పొంగిపొరలుతున్న ఆ నదిని చూస్తూంటే, మా ప్రయాణం తలపుకొచ్చి, అసలు గమ్యం చేరుకోగలమా అన్న సందేహం యెక్కువ కాజొచ్చింది. ఆలోచిస్తున్నకొద్ది బుర్ర వేడెక్కుతోంది. అందుకని, ఆలోచన కట్టిపెట్టి, సిగరెట్ తాగాలని, గట్టుమీాద చతికిలబడ్డా. సిగరెట్

కోసం జేబులో చెయిపెడితే ఏముంది, తడిసిన సిగరెట్ పెట్టె చేతికి తగిలింది. ఒక్కక్షణం అలాగే వుండిపోయాం. గడచిన సంఘటన కళ్ళముందు నిలచింది. మేం ఆ దోనెలో సగం దూరం వచ్చేటప్పటికి, ఒక పెద్దకెరటం వచ్చింది. దాని తాకిడికి దోనె తల్లక్రిందులైనంత పనిజరిగింది. అప్పుడు నేనుకూడా తెడ్డుతీసుకుని గబగబా నడపాల్సివచ్చింది. ప్రాణం రక్షించుకోవాలన్న ఆ ఖంగారులో, నా నడుంవరకూ తడిసిపోయిన సంగతే నేను పట్టించుకోలేదు. ఆ సమయంలో సిగరెట్లు అసలు గుర్తుకొస్తాయా? అందుకే ఇప్పుడు విచారించాల్సి వస్తోంది. 'సరేలే ఏంచేస్తాం' అనుకుంటూ తడిసిపోయిన ఆ సిగరెట్లను తీసి, ఆ గట్టుమీద ఆరబెట్టాను.

అప్పటికి మధ్యాహ్నం అయింది. 'మే' నెలలో వుండేటంత తీవ్రంగావుంది ఎండ. సిగరెట్లు త్వరగా ఆరిపోతాయిలే అని సంతోషించా. కాని, సైన్యంలోఇచ్చిన, దళసరిబట్టలు వేసుకున్నందుకుమాత్రం విచారించా. జుట్టు ఆరబెట్టటంకోసం, తలమీదిటోపీ తీసేశాను. ఒకవైపు, నెత్తిమాడుతున్నా, అలా ఒక్కణ్నీ అక్కడ, ఆ మబ్బుల్నీ, నదినీ, నిర్జనప్రదేశాన్ని చూడటంలో ఏదో ఆనందంగానే వుంది.

అంతలో, గ్రామం చివరనుండి వస్తున్న ఒకమనిషి కనపడ్డాడు...అతనిముందు నడుస్తున్నాడు ఒక ఆరేళ్ళకుర్రాడు... వాళ్లు చాలా హడావుడిగా నడుస్తూ 'జీప్'దాకా వచ్చారు. 'జీప్'ను చూసి ఆగి, వాళ్లు నావైపు వచ్చారు. ఆ పొడుగాటి స్థూలకాయుడు తిన్నగా నా దగ్గరకొచ్చి. 'హలో, బ్రదర్' అంటూ తనబలమైన మోటుచేతిని ముందుకుచాచాడు.'హల్లో'

అంటూ, నేనూ, అతనితో కరస్పర్శచేశాను. ఆ మోటుమనిషి వంగి కుర్రాడితో అంటున్నాడు. 'చిన్నాన్నకు నమస్తే చెప్పు బాబూ! మీ నాన్నలాగే, ఇతనుకూడా డ్రైవర్‌లా కనిపిస్తున్నాడు. మనిద్దరం లారీ నడిపేవాళ్ళం, ఇతను ఈ చిన్న కారుని నడుపుతున్నట్టున్నాడు...'

ఆకాశంకంటే నిర్మలంగావున్న చిన్నకళ్ళతో అమాయికంగా చూస్తూ, ధైర్యంగా చెయ్యిచాచాడు కుర్రాడు. వాడినిచూస్తే నాకెంతో ముద్దొచ్చింది. ఆనందంతో వాడి చెయ్యి నొక్కాను, చల్లగావుంది. "ఏం తాతా? ఎండ దంచేస్తున్నా, నీచెయ్యి ఇంత చల్లగావుందేం?" అన్నానవ్వుతూ.

నా మోకాళ్ళకు మెలేసుకున్నవాడు, ఆశ్చర్యంగా నా కళ్ళల్లోకి చూస్తూ "నేనేం తాతనుకాదు చిన్నాన్నా! మంచుతో బంతులుచేసి ఆడాను. అందుకే నాచేతులు చల్లగావున్నాయ్..."అన్నాడు ధీమాగా, అక్కడికి తనేదో పెద్ద ఘనకార్యం చేసినట్టు. వాడు మాట్లాడే తీరుచూస్తే నాకు నిజంగా చచ్చేంత నవ్వొచ్చింది, ఆపుకోలేక నవ్వాను. నాతో బాటే నవ్వుతూ ఆ మోటుమనిషి, వీపునున్న మూటనుదింపి నా ప్రక్కన కూర్చొన్నాడు. నేనేమీ అడగకుండా, అతనే చెప్తున్నాడు "పిడొక పెద్దబండ నాకు...వీడి తస్సాదియ్యా, బలే వేపుకుతింటాడులే. అసలు చెప్పినమాటవింటాడా? అబ్బే, అదేంలేదు తమ్ముడూ—ఊరికేపరిగెడతాడు. ఎందుకు చెప్పా, వాడూ అలవటం, నన్నూ ఆయాసపర్చటం...పోనీ

తిన్నగా నడుస్తేనా...అహఁ అదీలేదు...రాళ్ళతో ఆడటం...మంచుతో బంతులుచేయటం...అబ్బబ్బ...వాణ్ని అదుపులో పెట్టటానికి తాతలు దిగివస్తున్నారనుకో..." అంటూ కాస్సేపు నిశ్శబ్దంగానే వున్నాడు..."నా సంగతేంటి బ్రదర్...యజమానికోసం కూర్చున్నావా?" మళ్ళీ అడిగాడు. ఎందుకో, నేను డ్రైవర్ని కాదన్నవిషయం అతనికిప్పుడే చెప్పాలనిపించలేదు నాకు, అందుకే 'ఔను' అన్నాను.

"అతను అవతలివైపునుంచి వస్తున్నాడా?"

"ఔను"

"దోనె త్వరగానే వస్తుందా?"

"రెండుగంటల్లో రావచ్చు."

"సరే అయితే బాగానేవుంది. నాకూ బాగా వ్యవధి వుంది. నేనూ కాస్త 'విశ్రాంతి' తీసుకోవచ్చు. నాకూ పెద్ద తొందరలేదులే. పోతూపోతూ నిన్నుచూసి, సరేలే, మనవాడొకడిక్కడ కూర్చున్నాడుకదా, కాస్సేపు సరదాగా మాట్లాడుదాం అని ఇటువచ్చా. పైగా సిగరెట్ తాగుదామనుకున్నా. ఒంటిపిల్లి రాకాసిలా ఒక్కడు తాగుతే ఏం మజావుంది. ఏమంటావ్? ఏం సిగరెట్లు తడిపేశావా? భలేవాడివే! తడిసిపోయిన పొగాకు—జబ్బుచేసిన గుర్రం, రెండూ దండగే...ఔనా?...హుఁ!...సరే...నా దగ్గరున్న సరుకును రుచి చూడు..." అంటూ...అతను పాంటుజేబులోంచి సిల్కు పాకెట్ ఒకటి బయటకు తీశాడు...పొట్లం విప్పుతోంటే, దాని మీదున్న అక్షరాలు స్పష్టంగా తెలుస్తున్నాయ్..."ప్రియ

మైన సైనికమిత్రునికి, లెబ్డ్యాన్స్కయా సెకండరీస్కూల్ విద్యార్థి ప్రేమతో ఇచ్చినది" అని వుంది.

ఆ పొగాకును ఇద్దరం కాల్చాం...ఇంట్లో పండించిన ఆ పొగాకు చాలా ఘాటుగావుంది. పొగతాగుతూ, చాలా సేపటివరకూ ఇద్దరం మాట్లాడలేదు. వాతావరణం అలా వున్నప్పుడు, రోడ్లు అంత అవకతవకగా వున్నప్పుడూ, ఆ కుర్రాణ్ని తీసుకుని, ఎక్కడికెళ్తున్నాడా అని అడుగుదామను కున్నా. కాని అతనే ముందు నన్ను అడిగాడు.

"యుద్ధం జరిగినంతకాలం డ్రైవర్‌గానే వున్నావా?"

"ఇంచుమించుగా"

"యుద్ధరంగంలోనేనా?"

"ఆహా!"

"బాగానేవుంది ఐతే మనిద్దరం ఒకటేనన్నమాట... నేనూ, అలాగేపనిచేసి, చాలా అవస్థలుపడ్డాలేతమ్ముడూ..." అన్నాడతను, తన రెండుచేతుల్తో మోకాళ్ళను రాసుకుంటూ. అలా కూర్చున్న అతన్ని పరికిస్తూ, అతని కళ్ళల్లోకి చూశా. కాని, చిత్రం...ఆ విధంగా, ఒక్క నిమిషంసేపు, అతని కళ్ళ ల్లోకి సూటిగా చూడలేకపోయా. నేనే ఏమిటి? దైన్యత, ఏదో అర్థంకాని బాధ ప్రతిబింబిస్తోన్న కనుపాపల్లోకి ఎవరుమటుకు చూడగల్గుతారు? ప్రక్కనేవున్న ఎండుపుల్ల ఒకటి తీసుకుని, దానితో ఇసుకలో ఏదో వ్రాస్తున్నాడు. అతను ఇసుకవైపు నుంచి దృష్టి మరల్చకుండా, అలాగే చూస్తూ అంటున్నాడు: "అదేమిటో ఒక్కొక్కప్పుడు రాత్రుళ్లు నాకు అసలు నిద్రే

పట్టదు. చీకట్లోకిచూస్తూ అలా కూర్చుంటే, బలేచిత్రమైన ప్రశ్నలు నాముందు నిలుస్తాయిసోదరా...నే నెందుకు బ్రతికుం కుండాలి? అసలు ఎవరికోసం బ్రతకాలి? నిస్సారమైన ఈ బ్రతుకువల్ల ప్రయోజనం ఏంటి...?...ఇంకా ఏమేమో నా ప్రశ్నలు—ప్రశ్నలపరంపరలు—ప్రశ్న లేకాని జవాబుల్లేవు— ఆ రాత్రి చీకటిగాని పగలు సూర్యకాంతిగాని, ఆ ప్రశ్నలకి జవాబివ్వలేదు—ఇకముందుకూడా ఇవ్వవ్ తమ్ముడూ— ఇవ్వవ్—" అతని జీరబోయిన గొంతులోంచి మరి మాటలు పెగలలేదు—అతను—తన చిన్న కొడుకుని దగ్గరకు తీసుకుని, ప్రేమతో తల నిమురుతూ "బాబూ——ఆడుకోవా? నీళ్ళతో ఆడితే బలేగా వుంటుంది? ఔనా—ఊఁ!— అద్దదీ—అయితే మరిపో—ఆడుకో—" అంటూ వాడి చెక్కిళ్ళమీద ముద్దెట్టుకున్నాడు...స్వేచ్ఛకలిగినందుకు సంతో షిస్తూ, ఛంగునదూకి, పరిగెట్టాడా కుర్రాడు..."చూడు బట్టలు తడుపుకోకు" అన్న అతనిమాటలు వినుపించుకోకుం డానే, నీళ్ళదగ్గరకుపోయి గెంతుతున్నాడు వాడు.

పొగతాగుతూ, మరికొన్ని క్షణాలు నిశ్శబ్దంగానే గడిపేశాం. నీళ్ళదగ్గరున్న ఆ కుర్రాడిమీదేవుంది నా దృష్టి అంతా. ఖరీదైనవి కాకపోయినా, చక్కనిబట్టలు కట్టు కున్నాడు ఆ కుర్రాడు—పొడుగుచేతులకోటూ, ఆ ఉన్ని బుల్లి మేజోళ్ళు, వాడికి బాగా సరిపోయింది. నల్లసిల్కుతో కుట్ట బడిన పువ్వులు చక్కగా కత్తిరించబడ్డ మెడ, ఆ కోటుకు అందంచేకూర్చాయ్—అవి తయారుచేయబడినతీరుచూస్తుంటే

అవన్నీ ఎవరో—బాగా పనితనంగల అమ్మ చేసినట్లుగా వున్నాయ్—ఆ తండ్రీ తొడుక్కున్న బట్టలు చూస్తూంటే, నిజంగా వింతగానేవుంది...అసలే అతను తొడుక్కున్నది ఎప్పటిదో పాతకోటు—అందులో—చిరిగిపోయిన—చోట్లల్లా—చిందరవందరగా కుట్టబడింది—పెద్దపెద్ద మాసికలతో ఆ పాంటు ఘోరంగావుంది—అతని కాలికున్న మేజోళ్ళనిండా కన్నాలే—వాటి అవతారంచూస్తే ఆ బట్టలకెప్పుడూ ఆడదాని చెయ్యి తగిలినట్లు లేదు—ఒకవేళ అతనికి భార్యలేదేమో—! లేకపోతే భార్యకీ, అతనికీ ఏదైనాతగాదా ఏమోఅనుకున్నా—

నీళ్ళతో కేరింతాలు కొడుతున్న కొడుకును ఒకసారి చూసి, తిరిగి మాట్లాడటం మొదలెట్టాడతను—"చాలా సాధారణంగానే మొదలైంది నా జీవితం—అసలు 'మావూరు వొరనెజిగబర్నియా' నేను 1900 సంవత్సరంలో పుట్టాను—" అని ఛట్టున ఆపేశాడతను—పీలుస్తున్న పొగ గొంతులో పోయి ఒక్కనిమిషం ఉక్కిరిబిక్కిరి అయ్యాడు పాపం—కాస్సేపయ్యాక తిరిగి చెప్పసాగాడు—ఒళ్ళంతా చెవులుచేసుకుని విన్నాను— "అవి దేశంలో కలహాలు చెలరేగినరోజులు. అప్పుడు నేను 'ఎర్రసైన్యంలో'ని 'కివిడ్జె' దళంలో వుండేవాడిని. 1920 వ సంవత్సరంలో—'కుబాన్' ప్రాంతాలకు వెళ్ళిపోయా. అక్కడ 'కులక్'ల దగ్గర పశువులకంటే కష్టంగా పనిచేసి బ్రతికేవాణ్ణి. మా అమ్మా, నాన్నా, చెల్లి అంతా ఆకలి కరువుకు ఆహుతైపోయారు—ఈ ప్రపంచంలో 'నా' అనేవాళ్ళు అంతాపోయి, చివరికి నేను మటుకు మిగిలా. సరే

ఎలాగో ఒకసంవత్సరం గడిచిపోయింది. 'కుబన్'లో వున్న సుకీకెను అమ్మేసి తిరిగి 'ఒడెసా'కు బయల్దేరా. మొదట్లో ఒకవస్త్రదుంగి దుకాణంలో పనిచేసి తర్వాత ఫాక్టరీకి వెళ్లా. అక్కడి మెకానిక్ పని నేర్చుకున్నా—తర్వాత, వెంటనే నాకు పెళ్ళయింది. నా భార్య మొదటినుంచీ, పిల్లల శిక్షణాలయంలోనే పెరిగిందట. ఆమె దిక్కులేనిది అయినా బలేపిల్లే. నాకుమల్లే కాకుండా, చురుకైనది. గడుసుది. ఇతర్లను సంతోష పెట్టడంలో బలేనేర్పరిలే. కష్టాలను చిన్నతనంనుండే రుచి చూసింది కాబట్టి ఇతర్ల బాధను సులువుగా అర్థంచేసుకునేది. ప్రక్కనుంచికాకుండా ఎదురుగుండా చూస్తే ఆమె ఎంత బాగుండేదనుకున్నావ్? అందుకే నేనెప్పుడూ ఎదురుగుండానే వుండి చూస్తూ వుండిపోయేవాణ్ని—నిజం చెప్పాలంటే బ్రదర్—ఆమెను ప్రేమించినంత 'ఇది'గా ప్రపంచంలో మరెవ్వరినీ ప్రేమించలేదు – మరెప్పుడూ ప్రేమించనూ లేను.

పనిచేసి చేసి ఇల్లు చేరుకునేసరికి చిరాగ్గావుండేది. ఒకొక్కప్పుడూ మహాచిరాగ్గా వుండేది. అయినా ఆమె ఎప్పుడూ విసుక్కునేదిగాదు. పైగా ఎంతో ప్రేమగా దగ్గరికొచ్చి, తియ్యగా మాట్లాడేది. దానితో మనసు శాంతిపడి, ఆమెను దగ్గరకు లాక్కుని "వెధవపనివల్ల చికాకుపడి, దురుసుగా మాట్లాడా, క్షమించవా ఇరీనా" అని అనబోతే, తన మృదువైనచేత్తో నా నోరుమూస్తూ, తన చిన్నతలను, నా హృదయంలో దాచుకునేది...అప్పుడు నిజంగా బ్రదర్... చేసిన కష్టంఅంతా మర్చిపోయి...ఏదో స్వర్గసౌఖ్యం అనుభ

వించేసాణ్ణి. ఆ ఆనందంతోనే ఇంత తిని పడుకుని ప్రొద్దున్నే లేచేసరికి ఎక్కడలేని సత్తువా వచ్చేది. తిరిగి ఫ్యాక్టరీలో ఎటు వంటి బండపనైనా సునాయాసంగా చేసేసేవాణ్ణి.....అసలు జీవితం సుఖంగా నడవాలంటే, మనకు దొరికే భార్య అంత తెలివిగానూ, ఛలాకీగానూ వుండాలయ్యా...

జీతాలిచ్చే రోజున కుర్రాళ్ళతో కలసి, అప్పుడప్పుడు నేనూ తాగేవాణ్ణి...ఒక్కొక్కప్పుడు తప్పతాగి ఒళ్ళు తెలియక కాళ్ళీడ్చుకుంటూ వచ్చేవాణ్ణి. అప్పుడుగాని, నన్నెవ రైనా వీధుల్లో చూస్తే, తప్పకుండా భయపడేవారే. ఆ రోజుల్లో నేను యువకుణ్ణి కాబట్టి, తెగ తాగగలిగేవాణ్ణిలే... ఆ తాగినమైకంలో వీధుల్లో ఇటూ అటూ తూలుతూ, క్రిందపడుతూ, మీదపడుతూ, ఇంటికెళ్ళేలోపల వంట్లో సత్తువ అంతా ఖాళీ అయిపోయేది. దానితో కుప్పలా కూలిపోయే వాణ్ణి. అయినా ఆమె ఏమీ అనేదికాదు. పైగా నవ్వుతూ పలకరించేది..."అండ్రీ...ఇవాళ్టికి నువ్విక్కడే పడుకో... మంచంమీద పడుకుంటే మైకంలో కిందపడిపోతావ్..." అనేది నా దగ్గరకొచ్చి బూట్లువిప్పుతూ. ఏదో మంత్రం జల్లి నట్లయి, ఆమె చెప్పినట్లల్లా చేసేవాణ్ణి. నే పడుకోగానే తన మెత్తనివ్రేళ్ళతో నా నుదురుని నిమురుతూ, నాకు నిద్రవచ్చే టంతవరకూ, ప్రేమగా కబుర్లుచెప్పేది....ఆమెకు నేనంటే ఎంత జాలో ఊహించలేనయ్యా....

ప్రొద్దున్నే తెలివిలోకి రావటంకోసం రోజూకంటే రెండుగంటలు ముందే లేపేది. అలా తప్పతాగినతర్వాత

వెంటనే నేనేమీ తిననన్నమాట ఆమెకు తెల్సు....అందుకే తాగినతర్వాత ఏమీ జరక్కుండా బాగా ఉపకరించే 'ఓడ్కా' ఒక గ్లాసునిండా తెచ్చియిచ్చేది. "ఆండ్రీ ఇదిగో తీసికో.... ఇంకెప్పుడూ తాగవ్రుగదూ?" అంటూ అమాయకంగా నా కళ్ళల్లోకి చూసేది—అంతే—మరి తర్వాత అలా తాగేవాణ్ణి కాదు. ఆమెకు నాలో అంత నమ్మకం—అందుకే ఆమె ఇచ్చిన 'ఓడ్కా' తాగేసి ఆమె ప్రేమకు కృతజ్ఞత తెల్పబోతే, పదాలు దొరికేవికావు. అందుకే హృదయంలోనే తెల్పుకునే వాణ్ణి. తేలికపడిన గుండెతో లేచి ఆమెను గాఢంగా ముద్దెట్టు కుని పనిలోకి వెళ్ళిపోయేవాణ్ణి. ఒకవేళ ఆమెమాత్రం దురు సుగా మాట్లాడినా తిరిగి తాగివచ్చేవాణ్నేమో! దైవసాక్షిగా, తాగే వచ్చేవాణ్ని. భార్య మూర్ఖురాలైతే అలాగే జరుగు తుంది...చెబితే నువ్వు నమ్మవ్ కాని బ్రదర్...ఆ విధంగా జరిగే కుటుంబాల్ని, నేనెన్నో చూశాను...

సరేనయ్యా అలా కొన్నాళ్ళుజరిగాక పిల్లలుకూడా పుట్టారు...మొదట కొడుకు తర్వాత ఇద్దరూ అమ్మాయిలు. అప్పుడే నేను తాగటం మానేయాల్సివచ్చింది. వచ్చినజీతం అంతా నా భార్యచేతికే ఇచ్చేవాణ్ణి. కలకలలాడుతోన్న ఇంటిపనుల్లో మునిగిపోయి, అసలు తాగుటకు వడేదికాదు... ఎప్పుడైనా ఒక్కొక్కప్పుడు సెలవరోజునమాత్రం ఒక గ్లాసుడు 'బీర్' తాగి దానితోనే సరిపెట్టేసేవాణ్ణి...

1929వ సంవత్సరం వచ్చింది. నాకు కార్లలో ఆసక్తి

కలిగింది. ఎలాగో డ్రైవింగ్ నేర్చుకుని ఒకలారీమీద పని చేయటం మొదలెట్టా. ఫాక్టరీ పనికంటే, నాకీ పనే బాగా నచ్చింది. అందుకే డ్రైవింగ్ చేస్తూనే, నాకు తెలీకుండానే పదిసంవత్సరాలు గడిపేశాను. అదంతా ఒక కల. పదిసంవత్సరా లొక లెక్కేంటి? నలభై దాటిన ఎవడైనా అడుగు అతని జీవితమంతా ఎలాగడిపాడని. అప్పు డర్థమౌతుంది అతనేదీ గుర్తించలేదని...అసలు గతంఅంతా అంతేలే.

ఆ పదిసంవత్సరాలు, రాత్రింబవళ్లు పనిచేశా. నేను బాగా డబ్బు సంపాదించినమూలంగా, ఇతర్లకేమీ తీసిపో కుండా హాయిగానే బ్రతికాం. దానికితోడు మా పిల్లలు మరింత ఆనందం చేకూర్చారు. ముగ్గురూ బాగా చదివేవారు. అందులోనూ పెద్దవాడు ఆంటోలీ మరీ తెలివైనవాడు. వాడు లెక్కల్లో దిట్ట...అందుకే ఒకసారి మాస్కూలోని పేపర్లో కూడా వచ్చింది వాడిపేరు. వాడి కా తెలివితేటలెలావచ్చా యని అడిగితేమాత్రం చెప్పలేను. కాని...వాడు తెచ్చుకున్న మంచిపేరుచూసి, చాలా ఆనందించేవాణ్ణి. నిజంచెప్పాలంటే సోదరా...నా కొడుకింతవాడయ్యాడని చాలా గర్వించేవా ణ్నంటేనమ్ము—

ఈ పదిసంవత్సరాలనుంచీ కూడబెట్టిన డబ్బుతో, యుద్ధంరాకముందే ఒక చిన్నగుడిసెను కట్టుకున్నాం...ఆ గుడిశెలోని రెండుగదులూ, ఒక వసారా, ఒక షెడ్డూ, నిజంగా మాకు ఎక్కువే. దానికితోడు ఇరీనా ఎలాగో రెండుమేకల్ని తీసుకొచ్చింది. అంతకన్నా ఇంకేంకావాలి? మా పిల్లలికిపాలు, ఉండటానికి చక్కనిఇల్లు, కట్టుకోటానికి మంచిబట్టలు, తిన

టానికి తిండి, కాళ్ళకుజోళ్ళు అన్నీ కుదిరాయ్...అన్నీ బాగానే కుదిరినా, ఇల్లుకట్టుకున్న చోటుమటుకు సరియైనది కాదమ్మా—అది విమానాశ్రయానికి బాగా దగ్గరలో వుంది. అక్కడకాకుండా, మరేచోటునైనా కుటీరం కట్టివున్నట్టయితే, నా జీవితమే మరోవిధంగా వుండేది తమ్ముడూ—

సరిగ్గా అప్పుడొచ్చింది—యుద్ధం. ఆ మరునాటిరోజే సైన్యంలోచేరమని పిలుపొచ్చింది—నా భార్యా, పిల్లలూ అంతా వచ్చారు స్టేషన్కి నన్ను పంపించటానికి—ఆడపిల్లలిద్దరూ ఏమీ ఏడ్వకపోయినా ఆంటోలీమాత్రం చలివేసిన వాడిలా వణికిపోయాడు. అయినా ఎలాగో తమాయించుకున్నాడు...కాని...ఆమె—నా ప్రాణంకంటె ఎక్కువైన, నా 'ఇరినా' మాత్రం ఆ బాధను భరించలేకపోయింది. మా పదిహేడేళ్ళ దాంపత్యంలోనూ అంత దుర్దినం ఎప్పుడూ రాలేదు. ఆ రాత్రి ఆమె కన్నీళ్ళతో నా చొక్కా పూర్తిగా తడిసిపోయింది. ఉదయం అయింది. కాని ఆమెలో మార్పేమీలేదు—అంతా స్టేషన్కి వెళ్ళాం—స్టేషన్లో ఆమె ముఖాన్ని చూడలేకపోయా—రాత్రంతా ఏడ్చినట్టుంది—కళ్ళంతా వాచిపోయాయ్—ఒగురుస్తూ ఎండిపోయిన పెదవుల్ని, లోతుకుపోయిన కళ్ళనీ చూస్తూంటే, పిచ్చెక్కిన వాళ్ళ ముఖంలావుంది—జేబురుమాలుతో ముఖాన్ని కప్పుకుంటూ, తనబాధను దాచాలని వృథాగా ప్రయత్నిస్తోందామె. ఆఫీసర్లు నన్ను లోపలికి రమ్మని చెప్పగానే అమాంతంగా నా మెడకు మెలేసుకుని ఏడవటం మొదలెట్టింది—కూలిపోయే

మహావృక్షంలాగ, ఆమె నిలువెల్లా కంపించిపోతోంది. పిల్లలు ఆమెను మాటల్లో పెట్టాలని ప్రయత్నించారు. అదేం కుదర లేదు—ఇతర్లంతా తమ భర్తలతో ఏదేదో మాట్లాడు కుంటున్నారు. కాని నా భార్యమటుకు బాధతో బ్రద్దలై పోతోంది—ఇంక లాభంలేదని ఆమెను దగ్గరకంటూ లాక్కొని "అదేంటి ఇరీనా ధైర్యంగా వుండాలి—ఏడిస్తే ఎలా— నే వెళ్ళేటప్పుడైనా మాటలాడు మరి—ఏడవకు—"అన్నా ఆమెకు ధైర్యం చెప్పాలనే వుద్దేశ్యంతో—కాని ఆమె ఏడు స్తూనే ఏమందో తెల్సా సోదరా—"మనం బ్రతికుండగా మళ్ళీ కల్సుకోలేం ఆంద్రీ—కల్సుకోలేం—" అంది—ఆ పరి స్థితి చూసి, నా హృదయం పగులుతున్న సమయంలో ఆడవల సిన మాటలేనా అవి—ఆమెను విడిచిపెట్టడం, నాకూ ఎంత బాధాకరమో ఆమె ఊహించలేకపోయింది. ఎందుకనిపిం చిందో మరి—ఆమెచేతులు విడదీసి ఒకతోపుతోశా—నేను మామూలుగానే అనుకున్నా, ఆ తోపుకు ఆమె మూడడుగుల దూరం వెళ్ళింది—ఆమె మళ్ళీ చిన్నిచిన్ని అడుగులు వేసు కుంటూ నా దగ్గరకొచ్చింది...నేనేదో పిచ్చికోపంతో అను స్తున్నా—"అదేనా నన్ను పంపించే విధానం? ఏం, నేను బ్రతికుండగానే కాల్చేద్దామనా?" అని ఇంకా ఏదేదో అన బోయా కాని—ఆమె ముఖంలోని అమాయకత్వం, ఆ కళ్ళ ల్లోని బాధ చూస్తుంటే మరి ఆ కోపం ఏమైందో తెలియదు కాని—ఆమెను అమాంతంగా కౌగలించుకున్నా—" అంటూ హఠాత్తుగా ఆపేశాడు—అతను రెండుక్షణాలవరకూ ఏమీ మాటలాడలేకపోయాడు. అంతబాధ ననుభవిస్తూన్నా, అతని

కళ్ళల్లో నీళ్లు లేవు—ఈ విధంగా ఎన్నో, కొన్ని లక్షలసార్లు ఏడవటంతో ఆ కళ్ళల్లోని నీరంతా ఎండిపోయిందేమో! అతను చాలా ఆవేశంగా వున్నాడు—అతని పెదవులు వణుకు తున్నాయ్—గడ్డం అదురుతోంది—అతన్ని చూస్తే నాకు జాలేసి "ఎందుకలా అయిపోతావ్—ధైర్యంగా వుండు" అన్నా అతను నా మాట వినిపించుకున్నట్లు కనపడలేదు—బరువుగా నిట్టూరుస్తూ అన్నాడతను—"ఆ సంఘటన—ఆమె నావిధంగా తోసేసిన సంఘటనే, బ్రతికినంతకాలం నన్ను కలచి వేస్తుంది—నేను చేసిన ఆ ఘోరానికి నా మనసు నన్నెప్పుడూ క్షమించదు సోదరా క్షమించదు" అని మరి మాటలాడలేక పోయాడు. అతని పగిలినగొంతులోని బాధను చెప్పడం ఎవ్వరి తరంగాదు—అలా మాటలాడకుండా అతను చాలాసేపు వుండిపోయాడు. ఆ పొగాకుతో మరో సిగరెట్ చుట్టుతా మనుకున్నాడు కాని, పాపం అతని చేతిలోని కాగితం చిరిగి పోయి పొగాకంతా పడిపోయింది. ఎలాగో తిప్పలుపడి అవకతవకగా, ఒక సిగరెట్టు చుట్టి, రెండుదమ్ములు లాగాడు. ఆ ఘాటు నసాళం అంటినట్టుంది. గొంతు సవరించుకుని, తిరిగి మొదలెట్టేడు తన కథని....

"ఎలాగో ఇరీనా చేతుల్లోంచి తప్పించుకుని ఆమె ముఖాన్ని రెండుచేతుల్లో తీసుకుని, ఆమె పెదవులను ముద్దెట్టుకున్నా. అబ్బ మంచుకన్న చల్లగా, సుద్దకన్నా తెల్లగా వున్నాయవి. ఆమె నా స్థితిలో మరొకక్షణంకూడా చూడ లేక పిల్లలకు 'గుడ్‌బై' చెప్పి, రైలులోకి ఇష్టంలేకపోయినా దూకాను. రైలు నెమ్మదిగా కదిలింది నా వాళ్ళను నానుండి

దూరంచేస్తూ....పిల్లలు ముగ్గురూ ఎలాగో నవ్వు తెచ్చిపెట్టుకుని చేయూపుతున్నారు. ఆమెమాత్రం గుండె బరువు ఎక్కువై ఆగిపోతుందేమోనని కాబోలు రెండుచేతులు గుండె కదుముకుని ముందుకువంగిపోయి అదోలా చూస్తూ బొమ్మలా వుండిపోయింది. ఆమె తీరుచూస్తే ఏదో పెద్దతుఫానులో ఎదురుగాలి తాకిడికి తట్టుకోలేక ముందుకువంగి నడుస్తున్న దానిలా వుంది. ఆ ఎండిపోయిన పెదవులు, తెల్లగా పాలిపోయిన చెక్కిళ్లు, జీవంలేని కళ్లు మరోనిమిషంకూడా చూడలేక బుర్ర గిర్రున తిప్పేసుకున్నా....బాధ భరించలేక కళ్లు మూసుకున్నా...అయినా, ఆమె అదేరూపంలో ప్రత్యక్షమైంది. అప్పట్నుంచీ ఎప్పుడూ ఆమె అదేరూపంలో కనిపిస్తోంది, ఆఖరికి కలల్లో కూడా. ఆ విధంగా తోసేసి, ఆమెకంత బాధకలిగించినందుకు నన్ను నేనే తిట్టుకున్నా. అయినా శాంతి లేదు. ఆ నాటి ఆమెరూపం గుర్తుకొచ్చినప్పుడల్లా, బండ కత్తితో, నన్నెవరో ముక్కలుగా నరుకుతున్నట్టనిస్తుంది....

సరే....తర్వాత 'ఉక్రేన్'లోని 'బెలయా సెరకోవ్' దగ్గరున్న మా యూనిట్లను చేరుకున్నాం....నాకు జిస్-5 ఇచ్చారు. అంటే నేను యుద్ధభూమిలోనే వున్నానన్నమాట. యుద్ధంగురించి విపులంగా చెప్పడం ఎందుకూ? నువ్వు స్వయంగా చూడనే చూశావ్‌గా?....సైన్యంలో వున్నప్పుడు, ముఖ్యంగా యుద్ధంలో వున్నప్పుడు, ఇంటిదగ్గర్నుంచి లెక్కలేనన్ని ఉత్తరాలొస్తాయ్....కాని అన్నిటికీ జవాబు లివ్వలేవు....ఒకవేళ ఇచ్చినా ఏంరాస్తావ్? అంతా బాగానే

వుందనీ, మాదళం ముందుకు పోతోందనీ, త్వరగానే వచ్చేస్తా ననీ రాస్తావ్....అంతేనా....? అసలు అంతకన్నా ఏముందిలే రాయటానికి ? యుద్ధంలోని ఘోరాలు వాళ్ళకు రాయగల వేంటి....? అబ్బే....నేనైతే, అటువంటివి ఒక్కముక్కగూడా రాయలేకపోయేవాణ్ని సుమా. అయినా అలాంటివి రాయటం వల్ల ఏం లాభం చెప్పు. యుద్ధంలో ఎలా వున్నావో అని భయపడి చచ్చేవాళ్ళకి, యుద్ధంలోని ఘోరాలు నువ్వు వర్ణించి రాశావంటే అది చదివి వాళ్లు బేబేలెత్తి హడిలి చస్తారు....అన్నంలో ఒక్క మెతుకుకూడా కొరకలేరు....ఒక్క క్షణంకూడా కన్ను మూయలేరు....పాపం వాళ్ళనావిధంగా బాధపెట్టడం ఎందుకు చెప్పు....యుద్ధంలో నిలవలేని పిరికిపంద వైతే, అసలు అక్కడికెందుకు రావాలి ?....వచ్చావు కనుక వీరసైనికుడవై మాతృదేశంకోసం, ఏ క్షణానైనా సరే ప్రాణాన్ని అర్పించటానికి తయారుగా వుండాలి. అంత దమ్ములేకపోతే బైటకుపోయి ఏ ఆవుపాలో పితుక్కుంటూ ఆడదానిలా బతకాలి. ..ఔనా....?.... ఏమంటావ్....? .... సరేలే....ఈ సోదంతా ఎందుకు ? వింటోంటే నీకు తల కాయనొప్పి వస్తోందేమోకూడా...అసలు సంగతి కొద్దాం" అంటూ సిగరెట్టుదమ్ము బాగాలాగి, గాలిలోకి పొగ వదుల్తూ తిరిగి మొదలెట్టాడు...."తీరాచూస్తే పూర్తిగా ఒక సంవత్సరంగూడా నేను యుద్ధంలో పనిచేయలేదు. ఆ లోపునే నాకు రెండుసార్లు గాయాలు తగిలాయ్...పెద్ద బల మైనవి కాదులే—ఒకసారి భుజంమీద, రెండోసారి కాలిమీద.

మొట్టమొదటిసారి 'బులెట్'వల్లా, రెండోసారి 'ష్రాప్‌నెల్' వల్లా తగిలాయా గాయాలు. మొదటిసారి బలే అదృష్టంలే— అసలు నేను చచ్చేవాణ్నే తెల్సా...జర్మన్లు, నా లారీమీద గుండ్లవర్షం కురిపించారు. కాని ఎలాగో చిన్నగాయంతో బతికి బయటపడ్డా...రెండోసారి మటుకేనయ్యా ఘోరం—ఆ దెబ్బతోనే పోతే ఫర్వాలేకపొయ్యేది—కాని...వాళ్ళ తస్సాదియ్యా...వాళ్ళకు దొరికిపొయ్యేనయ్యా కైదీగా...వాళ్ళు నన్ను 'లొజావెస్కీ'లో పట్టుకున్నారు. ఎప్పుడు...1942 'మే'లో—అసలది ఎలాజరిగిందో తెల్సా? ఒకసారి బలే ఘోరమైన పరిస్థితి ఏర్పడిందిలే—మా దగ్గరున్న 120 యం యం 'హొవిట్జర్' బేటరీలలో ఒకటి దూరంగా శత్రువులతో పోరాడుతోంది. అనుకోనివిధంగా వాళ్ళదగ్గరున్న మందు గుండు అంతా అయిపోవచ్చింది... శత్రువు జోరుగా ముందుకు వచ్చేస్తున్నాడు....మావాళ్ళదగ్గరమందు అయిపోతున్నకొద్దీ, వాళ్ళటాంకులు మరీ ముందుకొచ్చేస్తున్నాయ్....వాటిని కాని ఆపలేకపోతే, మా దళం అంతా నాశనమే....అందుకని ముందు మా వాళ్ళకి మందుగుండు చేరాలి....అది ఓపట్టానసాధ్యంలా కనపళ్ళేదు....ఎందుకంటే....వాళ్లు ఎడంప్రక్కనుండి టాంకుల తోనూ,ఎదరనుంచీ కుడినుంచి కాల్పులతోనూ మూడుప్రక్కల్నించీ చుట్టుముడుతోంటే మావాళ్ళకు సరుకునుచేర్చడం అంత తేలికైన పనేంగాదు. అయినా నా లారీనిండా మందుగుండునింపి తీసుకెళ్ళే ప్రయత్నంలోవున్నా. అప్పుడు మా దళం కమాండర్ వచ్చి నన్నేమని అడిగాడో తెల్సా? "సొకొలోవ్, ఈ

సరుకు తీసుకునివెళ్ళి వాళ్ళకందించగలవా?" అని. అతని ప్రశ్న తో నా ఆత్మాభిమానం దెబ్బతింది. వెంటనే "తీసుకెళ్ళగలనా. ఏంటి? తీసుకెళ్ళి తీరాలి. అది నా విద్యుక్తధర్మం. నా ధర్మం నెరవేర్చటంలో నేను నా ప్రాణానికి వెరువను కమాండర్" అన్నాను ధైర్యంగా. "సరే అయితే కానీ" అన్నాడతను నవ్వుతూ హుషారుగా. "స్టీరింగ్" ముందుకురికి మీాట తొక్కాను. అంతస్పీడుగా నేనెప్పుడూ "డ్రైవ్" చేయలేదు. మందుగుండుతో అంతజోరుగాపోవటం ప్రమాదం అని తెల్సు. అయినా ఏంచేయను? మా కుర్రాళ్ళంతా అక్కడ పట్టి చేతుల్తో యుద్ధంచేస్తూంటే నేను పెళ్ళికొడుకులా నెమ్మదిగా ఎలా వెళ్ళగలను? మా వాళ్ళని ఎప్పుడు చేరతానా అన్న ఆతృతతో లారీ ఎంత వడిగాపోతోందో నేను గుర్తించనేలేదు. నేను ఇంచుమించుగా చాలా దూరమే వచ్చేశాను. మహా వుంటే మా బాటరీ ఒక "కిలోమీాటరు" దూరంలో వుండొచ్చు. నేను రోడ్డు మలుపుతిరిగానంటే చాలు అక్కడే మా బాటరీవుంది. కాని ఇంతలో ఓ వింతజరిగింది. అక్కడ మా కాల్బలం ఒకటి వాళ్ళ మీాద గుండ్లు కురిపిస్తోంది. దాన్నలా వదిలివేసి నేనెలావెళ్ళను. . .సరే, దానిక్కావలసిన మందుఇచ్చా. మళ్ళీ నా లారీ దౌడుతీసింది. తారాజువ్వలా దూసుకుపోతోంది. రోడ్డు మలుపుతిరిగాను. మావాళ్ళను చేర బోతున్నా. రోడ్డుమీాద ఉంచబడ్డ ఏదో ఫిరంగి మా లారీని ఢీకొంది. అంతే. . .అప్పుడెంతశబ్దం వచ్చిందోకూడా నే విన లేదు. నా బుర్రలో ఏదో అగ్నిగోళం బద్దలైనట్లయింది. అంతే.

ఆ తర్వాత ఏం జరిగిందో నాకు గుర్తులేదు. మళ్ళీ తిరిగి నేను ఎలా బతికానో నాకు తెలేదు. అలా అక్కడ ఎంతసేపు పడున్నానో అంతకన్నా తెలీదు. ఎప్పుడో కళ్లు తెరిచాను. కాని లేవలేకపోయా, నా తలంతా కుదుపుతోంది. జ్వరంవచ్చినవాడిలా నా శరీరం అంతా వణుకుతోంది. కళ్లు చీకట్లుకమ్మి, అసలు నాకేమీ కనిపించటంలేదు. నా ఎడంభుజంలో ఏదో దూరి గొలుకుతూన్నట్టయి విపరీతమైన బాధపెడుతోంది. దానికి తోడు వళ్ళంతా చెప్పలేనంత నొప్పులు, ఎవరో రెండురోజుల్నుంచీ అదేపనిగా తొక్కుతూ, పడవకుండా కర్రలతో మోదినట్టుగా వుంది. పొట్టలోనినొప్పి భరించలేక పొట్టపిసుకుతూ, ఎంతసేపో అలాగే ఉండిపోయా...ఎంతసేపు అలా వుండిపోయానో నాకే తెలీదు. చివరికి, ఎప్పుడో కొంచం సత్తువ కలిగినట్టయింది. అతికష్టంమీద లేచాను. అయినా నాకేం తెలీలేదు. నే నెక్కడున్నానో, అసలు నాకేం జరిగిందోకూడా గుర్తులేకుండాపోయింది. మరి నుంచోలేక చతికిలబడుతూ పక్కనున్నవాటిని ఒక్కొక్కటి చూస్తూ అసలేంజరిగిందో గుర్తు చేసుకుందికి ప్రయత్నంచేస్తున్నా.

కొంతసేపు ఏమీ తెలీలేదు. తర్వాత నాచుట్టూ వున్నవాటిని క్రమంగా గుర్తుపట్టగలిగా. నేనుతీసుకొచ్చిన గుండ్లన్నీ రోడ్డుమీద చిందరవందరగా పడివున్నాయ్. నేను వచ్చినలారీ ముక్కముక్కలై పోయింది. దానిచక్రాలు తలోమూలా పడ్డాయ్.

అప్పుడు నాకాళ్ళ పరిస్థితిచెబితే నువ్వు సిగ్గేయటం

లేదా అని అడగొచ్చు. కాని సోదరా...నిజంగా కుంటివాడి కాళ్లే నయమనిపించిందంటే నమ్ము. పోనీ పారిపోదామన్నా దండగే. ఎందుకంటే నేను అప్పటికే శత్రువుల ప్రదేశంలో పడివున్నా. వాళ్లు నన్ను ఏక్షణంలోనైనా కైదీగాపట్టుకపోతారు.

ఇలాంటి అనుకోని సంఘటనలు, యుద్ధంలో అనేకం జరుగుతూంటాయ్. స్వయంగా అనుభవించినవాళ్లు తప్ప మిగతావాళ్లు వాట్ని నమ్మలేరు.

టాంకుల రొద వినపడటంతో నా ఆలోచనలకి బ్రేకు పడింది. నాలుగు జర్మను మీడియమ్‌టాంకులు, రాకాసిధ్వని చేసుకుంటూ దూసుకపోయాయ్...ఎటూ? నాలారీ వచ్చిన వైపు, అంటే మాదళం వైపుకన్నమాట! అప్పుడు నా మనసు ఎంత ఆరాటపడిందో నువ్వే ఊహించుకో! ఆ తర్వాత తుపాకులతో నిండిన 'ట్రాక్టర్లూ' కాల్బలాలూ, 'మొబైల్ కిచెనూ' అన్నీ ఒకదానితర్వాత ఒకటి వెన్నంటి వెళ్ళాయ్. వాట్ని చూడటానికి రోతపుట్టి, నా ముఖాన్ని గడ్డిలో దాచుకున్నా. అవన్నీ వెళ్ళిపోయాయనుకుని నా తలపైకెత్తాను నాకు వంద గజాలదూరంలో ఆరుగురు జర్మన్ 'సబ్‌మిషిన్ గన్నర్స్' వెళ్తున్నారు. వాళ్ళు నన్నుచూసి, నావైపు వస్తున్నారు. సరే అయితే నా అంత్యక్షణాలు సమీపించాయ్ అనుకుని పడుకుని చావటం ఇష్టంలేక కూర్చున్నా. నా దగ్గరకొచ్చారు. నేను నెమ్మదిగా నిలుచున్నా...ఏమనుకున్నాడోగాని, వాళ్ళల్లో ఒకడు తటాల్న వేళ్ళాడుతున్న తుపాకిని తీసుకుని నాకు గురి పెట్టాడు. తమాషా ఏంటంటే సోదరా, నా ప్రాణం వాళ్ళ

చేతిలో అల్లాడుతున్నా...అదేమిటో నాకు కొంచంకూడా భయమేయలేదయ్యో...నువ్వు నమ్మవులే నాకు తెల్సు, అయినా అదిమటుకు నిజం. వాడు నన్ను ఎక్కడ షూట్ చేస్తాడా అనిమాత్రం చూస్తున్నా.

వాడు యువకుడే. కండలుతిరిగి మంచి బలంగావున్నాడు. కాని, వాడి పెదవులుమాత్రం, దారంకన్న సన్నగావున్నాయ్. వాడికళ్ళల్లో రాక్షసత్వం కొట్టొచ్చినట్టుగా కనిపిస్తోంది...ఆ! వాడు షూట్‌చేసేముందు వెనకాముందూ ఆలోచించేరకం మాత్రం కాదు. ఆ విషయం వాడికళ్లే చెబుతున్నాయ్... వాడిచెయ్యి 'ట్రిగ్గర్'మీదకి పోయింది. నేనేమీ మాటలాడకుండా, వాడికళ్ళల్లోకి సూటిగా చూస్తున్నా. వాళ్ళల్లోనే ఒకడు వాడికంటే పెద్దవాడేలే, వాణ్ని ప్రక్కకు తోసేసి వుండకపోతే నేనీపాటికి నీతో మాటలాడుతుండేవాణ్నికాదు ...అదంతా అనుకోనివిధంగా జరిగింది. అసలు నా జీవితమే అంతలే. అన్నీ అనుకోని సంఘటనలు, విచిత్రసంఘటనలు, వాడు ఏదో వాళ్ళభాషలో అరుస్తూ నా దగ్గరకొచ్చి నా మోచేతిని వంచిచూసి, 'హోహో' అంటూ ఏదేదోఅన్నాడు. వాడిముఖంచూస్తే నా పరిస్థితికి జాలిపడుతున్నట్లుగా కనిపించాడు వాడు. రోడ్డువైపుచూపిస్తూ, నాతో వాళ్ళభాషలో ఏదో అంటున్నాడు. వాడి ఉద్దేశ్యం బహుశా నన్నాదారంట పారిపొమ్మనో ఏంటో...నాకేం అర్థంకాలేదు మరి...

ఆ మొదటివాడు మటుకు నా బూట్లవంకచూస్తూ, తనకు కావాలన్నట్టుగా చేత్తో సంజ్ఞచేశాడు...మంచిబూట్లే

అయినా పోన్లేఅనుకుని కూర్చుని, విప్పాను...వాడు బూట్లు తీసుకున్నాక నా మేజోళ్ళుకూడా విప్పి ఇవ్వబోతే వాడికి కోపమొచ్చినట్టుంది...వాడు మళ్ళీ తుపాకి తీసుకున్నాడు. దాంతో ఆ తక్కినవాళ్ళంతా విరగబడినవ్వటం మొదలెట్టేరు. ...ఉడికిపోయి వాడిముఖం నల్లగా మాడింది...ఆ తర్వాత వాళ్ళంతా వెళ్ళిపోయారు. వాడుమటుకు రోడ్డుమలుపు తిరిగే వరకూ, నన్ను మూడుసార్లయినా చూసివుంటాడు. వాడి కళ్ళల్లో నన్ను మింగేయాలన్నంత కోపం స్పష్టంగా కని పించింది...

ఉన్న సత్తువనంతా కూడగట్టుకొని, నడక ప్రారంభించా. మాతృదేశంమీది భక్తి నాలో ఆవేశం కలగచేస్తోంది...నేను రోడ్డుమీదకు చేరుకునేలోపున, అది పరిధులుదాటి, నా వళ్ళంతా వేడెక్కింది...ఆ వేడిలోనే, ఏదో తీవ్రమైన ప్రతిజ్ఞ పట్టి, పడమటిదిక్కుగా ప్రయాణం చేశా.

ఏదో ఆవేశంలో నడుస్తున్నానే కాని, అసలు నిజం చెప్పాలంటే నా కాళ్ళల్లో కొంచంకూడా బలంలేదు. అవి వాటిష్టమొచ్చినట్టు లాక్కెళ్లుతున్నాయ్...చూస్తున్నానన్న మాటే కాని, తాగినప్పటికంటే యెక్కువ మైకంగా వుంది... అసలంతా మసక మసకగావుంది. అయినా నడుస్తూనేవున్నా. అలా నడుస్తూనే వెళ్తే గంటసేపటికి ఒక కిలోమీటరు దూరం కూడా వెళ్ళలేను. న్యాయం ఆలోచిస్తే మరి, ఆ స్థితిలో ఆ మాత్రం వెళ్ళటం గొప్పే...అలా పడుతూ, లేస్తూ, అతి కష్టంమీద కొంతదూరం వెళ్ళానో లేదో...అటునుంచి

వస్తున్న కొందరు మనుషులు కనిపించారు. వాళ్ళు దగ్గరౌతున్న కొద్దీ స్పష్టంగా కనిపించారు. వాళ్ళంతా నాలాగే కైదీలుగా పట్టుబడ్డవాళ్ళే...బాగా పరికించి చూడగా వాళ్ళంతా మా 'డివిజన్'కి చెందిన జవానులాగే అగుపడ్డారు. సుమారు పది మంది జర్మన్ సబ్ మెషిన్ గన్నర్స్ వాళ్ళచుట్టూ కాపలా వుండి తీసుకొస్తున్నారు. వాళ్ళు నాకు మరీ దగ్గరగా వచ్చారు. ఆ 'గన్నర్స్'లో ఒకడు నన్ను చూసి ఏమీ మాట్లాడకుండానే తుపాకి మడమతో నన్ను బలంగా మోది, ఆ గుంపులోకి నెట్టాడు. ఆ దెబ్బకు నేనుకాని క్రిందపడినట్టయితే, ఆ జర్మన్ గాడిదకొడుకు నా అంతం చూసేవాడే. కాని అదృష్టవశాత్తు నా తోటికైదీల్లో ఎవరో ఒకడు నన్ను పడిపోకుండా పట్టుకుని నెమ్మదిగా నా చెవిలో ఊదాడు. "ఓపిక తెచ్చుకో సోదరా, కిందపడ్డావంటే వాళ్ళు నీ ప్రాణాలు తీసేస్తారు..." నాలో ఏ వీసమెత్తో మిగిలిపోయిన శక్తిని కూడగట్టుకుని అలాగే కాళ్ళీడ్చాను...

రాత్రి అనగానే వాళ్ళు లారీలో మరో ఇరవైమంది మెషిన్‌గన్నర్స్‌ని తీసుకొచ్చారు. వాళ్ళు త్వరగా నడవమని మమ్మల్ని తొందరపెట్టడం మొదలెట్టారు. తొందరగా నడవలేని వాళ్ళను, తుపాకి మడమలతో కొడుతున్నారు. కొందర్ని బూట్లతో తంతున్నారు...అసలు ఇంక నడవలేక పడిపోయిన వాళ్ళను రాక్షసంగా షూట్ చేస్తున్నారు. ఎలాగోలా పారిపోవాలని వృథాగా ప్రయత్నించారు కొందరు...వాళ్ళ మూర్ఖత్వం కాకపోతే ఎంత పరిగెత్తినా వెన్నెలలో కిలో

మీటర్ దూరంలో వున్నా సరే కనబడరటయ్యా... మొత్తా నికి వాళ్ళను షూట్ చేసేశార్లే...ఎవరు యెప్పుడు చస్తారో తెలీక ప్రాణాలు అరచేతిలో పెట్టుకుని, అర్ధరాత్రయేటప్పటికి ఒకగ్రామానికి చేరుకున్నాం...బాంబులు పడ్డాయేమో, ఆ గ్రామంలోని ఇళ్ళలో సగంపైగా కూలిపోయాయ్...అక్క డెవరూ మనుషులున్న జాడ కనబడటంలా. ఊరి మధ్యలోని చర్చిదగ్గరకు తీసుకెళ్ళారు మమ్మల్ని, దానిమీదకూడా బాంబు పడినట్టుంది. దానిముందు భాగంఅంతా కూలి పోయింది. ఆ రాత్రంతా ఆ చర్చిలోనే గడపాలి. నేల మంచు కన్న చల్లగావుంది. మాలో ఎవరిదగ్గరకూడా మంచికోట్లు కూడా లేవు. మా దళసరి యూనిఫారంలో వున్నాం... కొందరికి అవికూడా లేవు...వాళ్లంతా మామూలు చొక్కాలే తొడుక్కున్నారు. వాళ్ళంతా జూనియర్ ఆఫీసర్లాగున్నారు. 'యూనిఫారం' వుంటే తమని సులభంగా గుర్తుపడ్తారని అవి తీసేశారనుకున్నా—

ఆ రాత్రంతా భోరున వర్షం కురుస్తూనే వుంది. ఆ చర్చిమీద భాగంకూడా చాలా కూలిపోవటంవల్ల, మేం అంతా తడిసి ముద్దయిపోయాం...అక్కడ ఒక్కఅంగుళం మేర అయినా పొడిగా మిగలలేదు...ఆ వర్షంలో తడుస్తూ, ఆ చీకటికొట్లోనే రాత్రంతా గడపాలి. అబ్బ, తలుచుకుంటే గుండె పగులుతుంది. అయినా ఏం చేస్తాం...అలాగే వుండి పోయాం. అర్ధరాత్రిలో ఎవరో నా భుజం తట్టినట్టయి చూశా. ఒకతను నన్ను అడుగుతున్నాడు. "గాయాలు బాగా తగి

లాయూ కాన్సేక్?" "ఏం అలా అడుగుతున్నా వేం సోదరా?" అన్నా నేను అతనిముఖం పరికిస్తూ. "నేను డాక్టర్నిలే. నీ కేవిధంగానైనా సాయపడగలనని" అన్నాడు. అతనికి నా ఎడంభుజం చూపించా. అది వాచిపోయి చాలాబాధ పెడు తోందని చెప్పా. "అయితే చొక్కా తీసేయ్" అన్నాడు. అతను చెప్పినట్టే చేశా. అతను నాకు దెబ్బ తగిలినచోట వేళ్ళతో నొక్కి చూస్తున్నాడు. అతనలా నొక్కుతూంటే నాకు చాలా బాధనిపించింది. అయినా ఓర్చుకున్నా... అతనింకా నొక్కుతూనే వున్నాడు. నాకు భలే కోపమొచ్చింది. "ఏంటలా నొక్కుతావ్! నాకెంత బాధగావుందో తెల్సా. నువ్వు డాక్టరివా, దెయ్యానివా?" అన్నాను పళ్ళు మండి పోయి. అయినా అతను మానకుండానే "మాట్లాడకుండా నోరు మూసుకూర్చో. ఏం చెయ్యద్దన్నావంటే మరో నిమి షంలో బాధతో చస్తావ్" అంటూ—నా చేతిని గట్టిగా విది లించాడు. హబ్బ! అది ఎంత బాధ పెట్టిందనుకున్నావ్? దెబ్బకు నా కళ్ళల్లో గిర్రున నీళ్ళు తిరిగాయ్—

ఆ డాక్టర్ని చూస్తే నాకు భలే ఛిర్రెత్తింది. అతను నా పాలిటొక యమదూతగా కనిపించాడు. "ఏమిటి నువ్వుచేసిన పని? అసలే దెబ్బ తగిలుంటే దాన్ని విదిలిస్తావా? నువ్వు మనిషివి కాదు. రాక్షసుడివి" అంటూ ఇంకా ఏమేమో తిడుతున్నా పిచ్చికోపంలో. అతనుమాత్రం చిన్నగా నవ్వాడు. "ఇంకా నయం. ఆ చెయ్యి విదిలిస్తాంటే రెండోచేత్తో ఒక టిద్దామనుకున్నా—చూస్తే మంచివాడిలాగా వున్నావ్. నీ

చెయ్యి విరిగిపోలేదయ్యా కీలు జాయింటు తప్పిందంతే. అది మళ్ళీ సరిగ్గా పెట్టడంకోసం అలా విదిలించాల్సి వచ్చింది. ఇంకో నిమిషంలో నీ నెప్పి తగ్గిపోతుంది చూడు—" అన్నాడతను. అతను చెప్పింది నిజమే. నా నొప్పి కొంచెం తగ్గింది. అతనికి మనసులోనే కృతజ్ఞత తెల్పుకున్నా. "ఇంకా యెక్కడ తగిలాయ్ దెబ్బలు?" అడిగాడు అతను. మాట్లాడకుండా చూపించా—ఆ చీకట్లోనే తనపని చేస్తున్నాడు. అతను డాక్టర్ కాదు, నిజంగా దేవుడే అనుకున్నా.

ఆ రాత్రంతా చాలా చిరాగ్గావుంది. పోనీ బైటకు పోతే తేలికగా వుంటుందనుకుంటే అసలువాళ్లు బైటకు వెళ్ళనీరు. ఆ సంగతి ముందే చెప్పాడొక మెషీన్‌గన్నర్—మాలో ఒకడున్నాడు. దురదృష్టవశాత్తు వాడికి దేవుడంటే మహాపిచ్చి. తనక్కడుండటంవల్ల ఆ ప్రదేశం అంతా అపవిత్రం అవుతోందంటాడు. అది మహాపాపం అంట—బైటకు పోవడం ఎలా అంటాడు—మా సంగతి నీకు తెల్సే వుంటుంది. కొందరు వాణ్ని చూసి నవ్వటం మొదలెట్టారు. కొందరు తిట్టారు. కొందరు ఏడిపించటం మొదలెట్టారు. వాళ్లు అట్టా చేయడంతో, వాడిపిచ్చి మరీ యెక్కువైపోయింది—అది చాలా చెడ్డగా పరిణమించింది. వాడేం చేశాడో తెల్సా—తలుపుదగ్గరకు పోయి తనను బైటకు వదలమని అరుస్తూ, దబదబా బాదటం మొదలెట్టాడు—కొంతసేపయిన తర్వాత, ఒక జర్మన్ మెషీన్ గన్‌తో జవాబిచ్చాడు. ఘోరం ఆ పిచ్చాడుతోబాటు మరి

ముగ్గురుకూడా చచ్చిపోయారు...ఇంకోడికి తీవ్రంగా గాయాలు తగిలాయ్—వాడుకూడా ప్రొద్దుటికి చచ్చిపోయాడు.

శవాలనన్నీ ఒక మూలకి లాగి, అంతా నిశ్శబ్దంగా కూర్చున్నాం. ఈ ఘోరమైన సంఘటన జరిగినందుకు అంతా విచారించాం ఆ చీకట్లోనే. ఒకళ్ళనొకళ్లు తెల్సుకోడానికి ప్రయత్నం చేస్తున్నాం. ఎక్కడ చూసినా గుసగుసలేకాని, ఒక్కడూ గట్టిగా మాట్లాడటంలేదు. ఒకే 'ప్లాటూన్'కు చెందినవాళ్లు. ఒకేచోటులో పనిచేసినవాళ్లు దగ్గరకంటా కూర్చుని, వాళ్లు వాళ్లు, ఎలా ఖైదీలుగా పట్టుబడ్డారో చెప్పుకుంటున్నారు. అలాంటి అవకాశం ఇంతవరకూ ఎవరికీ దొరకలేదు. అందుకే ప్రతివాడు ఇంకోడితో మాట్లాడుతున్నాడు. నా ప్రక్కనేవున్న ఇద్దరి మాటలు మటుకు నాకు స్పష్టంగా వినిపిస్తున్నాయ్. వాళ్ళలో ఒకడిలా అంటున్నాడు—"రేపు ప్రొద్దున్న ఇక్కడనుండి తీసుకెళ్ళేముందు మనల్ని నుంచోపెట్టి, కమ్యూనిస్టులెవరో, కమిస్సార్లెవరో, ఆఫీసర్లెవరో అడుగుతారు. వాళ్ళనుండి తప్పించుకోవటానికి వేసిన నీ ఎత్తు నాకు తెల్సులే కమాండర్. చొక్కా తీసేసినంతమాత్రాన వాళ్లు నిన్ను గుర్తుపట్టలేరని నీ ఊహ! ఔనా? కాని, నేనొదుల్తానని మాత్రం అనుకోకు. నువ్వు కమ్యూనిస్టువని, వాళ్ళతో ఖచ్చితంగా చెప్తా" అని అంటున్నవాడు నాకు బాగా దగ్గర్లో కూచున్నాడు. వాడి ఎదురుగుండావున్నతను జవాబిస్తున్నాడు. అతని మాటల్నిబట్టి, అతను యువకుడే అనుకున్నా. "నువ్వంటే నాకు మొదట్నుంచీ అనుమానంగానేవుంది. ముఖ్యంగా

చదువురాదని కారణం చూపిస్తూ, పార్టీలో చేరనని చెప్పినప్పుడే అనుకున్నా నువ్వెప్పుడైనా ఇలా మారొచ్చని. ఎంతమారినా ఇంత ద్రోహివౌతావని మాత్రం నే నెప్పుడూ అనుకోలేదు—నువ్వు పథ్నాలుగో సంవత్సరం వచ్చేంతవరకూ చదువుకున్నావ్. కాదంటావా?" అని అడుగుతున్నాడు. రెండోవాడు దానికి ఖాతరుచేసినట్టైక్కడా కనపళ్ళేదు. "ఔను చదువుకున్నా. అయితే ఇప్పుడేంటి?" అని కొంచెం విసుగ్గానే అడిగాడు మొదటివాడు—దానికి రెండో అతనేమీ అనలేదు—అలా ఇద్దరూ, చాలా సేపు మౌనంగా వుండి పోయారు. తర్వాత ప్లాటూన్ కమాండరే అన్నాడు. "నన్ను చూపెట్టడంవల్ల చాలా నష్టంవుంది. అలా చేయకు కామ్రేడ్." నేను నీ కామ్రేడ్ని కాదు—కామ్రేడ్స్ దేశభక్తి ఇవన్నీ సరిహద్దులు దాటగానే పోయాయ్—నాకు ఎవరు ఎలాపోయినా అవసరం లేదు—నేను మటుకు బాగుండాలి. అందుకు ఏదైనాసరే చేస్తాను. అదీ నా పాలసీ" అని అన్నాడా మొదటివాడు. ఆ తర్వాత అసలు వాళ్ళేమి మాట్లాడలేదు. వాడిలో కరడుకట్టుకుపోయిన స్వార్థం చూస్తే, వాడంటే పరమఅసహ్యం వేసింది. ఇలాంటిద్రోహులు వుండటంవల్ల దేశానికే చాలానష్టం—వాడు ప్రొద్దునదాకా బతికివున్నాడంటే, నిజంగా అన్నంతపని చేసేస్తాడు—కాని, ఆ యువకుడు వాడికి బుద్ధిచెప్పలేదు...అతను చాలా బల హీనంగా వున్నాడు. సరే, అయితే వాడిపని నేనే పట్టాలని. లేచాను. ఆ యువకుడి దగ్గరకువెళ్ళి "నువ్వేనా కమాండర్వి"

అని అడిగా. అతను ఔనన్నట్టుగా తలూపాడు. "నిన్ను వాడు వాళ్ళకప్పజెప్తానంటున్నాడుగా. ఈ ద్రోహికి నేబుద్ధిచెప్తా... వాడు తన్నకుండా, వాడికాళ్ళు గట్టిగా పట్టుకో తక్కిన పని నేచేస్తా" అన్నా. అతను "సర్లే" అనుకుని వెళ్ళి వాడికాళ్లు గట్టిగా పట్టుకున్నాడు. నేను వాడి గుండెలమీద కూర్చుని రెండుచేతుల్తో గట్టిగా పీక నొక్కటం మొదలెట్టా. అరవటానికి కూడా వాడికి అవకాశం కలగలేదు. అలా పదినిమిషాలు పెనుగులాడాక వాడు నాలిక బైటకుచాచి, కళ్లుతేలేసేశాడు. ఆ దెబ్బతో ఒక ద్రోహిపని ఖాళీ...

ఏదో ఛండాలమైన పాముని చంపినట్టనిపించి చాలా రోతకలిగింది. అంతవరకూ నాచేతుల్తో ఎవర్నీ చంపలేదు. అందులో మనవాణ్ణి! మనవాడేంటిలే...వాడు ద్రోహి. నన్నడిగితే అసలు ద్రోహికంటే గర్భశత్రునైనా నయమేనంటా. తర్వాత ఆ యువకుడిదగ్గరికెళ్ళి "కామ్రేడ్ ఇక్కడెందుకు? ఇంకెక్కడైనా పడుకుందాం. ఈ చర్చి చాలాపెద్దదేలే. రా" అంటూ లేచాను. అతను నన్ననుసరించాడు.

వాడన్నట్టుగానే మర్నాడు మమ్మల్నందర్నీ వరసగా నుంచోపెట్టి అడగటం మొదలెట్టారు మాలో కమ్యూనిస్టులు, కమిస్సార్లు, ఆఫీసర్లు ఎవరెవరని...కాని ఒక్కడూ చెప్పలేదు. పోనీ, ఏవరెవరు ఏంటో చెప్పడానికి ద్రోహులుకూడా ఎవరూ కనపళ్లేదు వాళ్ళకి. మొత్తంమీద మా రెండువందలమంది లోనూ, నలుగుర్ని బైటకులాగారు. వాళ్ళల్లో ముగ్గురు రష్యన్లు. ఒకడు 'జ్యూ'. ఆ రష్యన్లు నల్లగావుండి, ఉంగరాల

జుత్తుతో వుండటమే చిక్కొచ్చింది పాపం. జర్మన్ ఆఫీసర్లు వాళ్ళదగ్గరకొచ్చి 'జ్యూ'హ అని అడిగి, వాళ్లు కాదని అంటూన్నా వినిపించుకోకుండా లాక్కెళ్ళారు.

ముండాకొడుకులు ఆ నలుగుర్నీ నిర్దాక్షిణ్యంగా కాల్చేసి మమ్మల్నందర్నీ ముందుకు తీసుకెళ్ళారు. ఆ కమాండర్ 'పొజ్నాన్'వరకూ నా పక్కనే నడుస్తూ వచ్చాడు. కాని 'పొజ్నాన్'లోమటుకు మేం ఇద్దరం విడిపోయాం. అదెలా జరిగిందంటావేమో! చెప్తావిను...చూడుసోదరా నేను ఖైదీగా పట్టుబడ్డప్పటినుంచీ పారిపోవటం ఎలాగా అని ఆలోచిస్తూనేవున్నా. మంచి అవకాశం వుంటేనే ఆపని చెయ్యాలి. లేకపోతే మరీ ప్రమాదం. 'పొజ్నాన్' వచ్చేలోపల మేం చాలా 'క్యాంప్'ల్లోనే వున్నాం. కాని అక్కడెక్కడా నా కలాంటి అవకాశం దొరకలేదు. ఇప్పుడే 'పొజ్నాన్' క్యాంప్ చూస్తూంటే ఇక్కడ మంచి అవకాశం వున్నట్టే కనిపించింది. రక్తవిరేచనాలు పట్టుకుని 'మే' మాసాంతంలో మావాళ్లు చాలామందే చచ్చిపోయారు. వాళ్ళందర్నీ పూడ్చటంకోసం, గోతులు తవ్వమని మమ్మల్ని ఆ దగ్గర్లోవున్న చిన్న అడవికి పంపించారు. గొయ్యి తవ్వుతూ, నన్ను కాపలాకాసే వాళ్ళని చూశాను. వాళ్ళలో ఇద్దరు ఒకచెట్టుకింద కూర్చుని, పోతుల్లా ఏదో తింటున్నారు. తక్కిన ప్రపంచాన్నంతా మర్చిపోయి మరొకడు ఎండ భరించలేక ఇంకో చెట్టుకింద కూర్చొని కునికిపాట్లు పడుతున్నాడు. వాడసలు యీ లోకంలో వున్నట్టు కనిపించలేదు. ఇంతకన్నా మంచి అదును ఎప్పుడు దొరుకుతుంది. చేతిలోని గునపం క్రింద

పడేసి, ఏకబిగిన్నా ఊరికి పరుగెత్తా. వాళ్ళెవరూ నన్ను చూడ లేదని రూఢి చేసుకున్నాకే పడమటివైపుకు పారిపోయా—

వాళ్ళిప్పటికప్పుడే పసిగట్టివుంటారేళ్ళే. అందుకే నన్నెవరూ తరమలేదు. అబ్బ! ఎముకలగూడులా వున్న నాకు బలం ఎక్కడనుంచి వచ్చిందోమరి ఆరోజు. 40 కిలోమీటర్లు పరు గెత్తాను. చెప్తే నమ్మలేనట్టుగా వుంటుందికదూ? నాకే ఆశ్చర్యం వేసింది...అలా ఊపిరాడకుండా నాలుగురోజులు పరిగెత్తా. కాని లాభం ఏంటి? ఆ వెధవలు నాలుగోరోజునే నన్ను పట్టేసు కున్నారు...

ఛ. అదికూడా అనుకోకుండానే జరిగింది. నేను పరు గెడుతూ ప్రొద్దున్నయేటప్పటికి ఒక పెద్ద బహిరంగప్రదేశం దగ్గరకొచ్చాను. అక్కడ్నుంచీ అడవిదగ్గరకెళ్ళాలంటే కనీసం, 3 కిలోమీటర్లయినా ఆ బహిరంగప్రదేశంలోంచి దాటాలి. పగటిపూట ఆ బయళ్ళలో పారిపోవటం ప్రమాదంఅనుకుని, అక్కడే ఏపుగా పెరిగినగడ్డిలో దాగుకున్నాను. అలా కొంతసేపు జరిగిపోయింది. తర్వాత నాకు దగ్గర్లోనే కుక్కల అరుపులు మోటారుసైకిళ్ళరొద వినపడింది...కుక్కలు అరుచు కుంటూ నాకుమరీదగ్గరయ్యాయ్. నాగుండె ఆగినంతపనయింది. అవి కరవకుండావుండాలని రెండుచేతుల్తోనూ ముఖం కప్పేసు కున్నా. అవి రానేవచ్చేశాయ్...నన్నుచూడగానే, అన్నీ ఒక్కసారే నామీద విరుచుకపడ్డాయ్—అంతే ఒక్క నిమి షంలో నావంటిమీద ఒక్క గుడ్డపేలికకూడా మిగల్లేదు. నా శరీరంతో వాటిష్టమొచ్చినట్టు ఆడుకుంటున్నాయ్...వాటిల్లో

పెద్దకుక్క ఒకటి నా గుండెలమీదకురికి దానిగోళ్ళతో, న గొంతునుగీరటం మొదలెట్టింది. ఇంకానయం, అదికూడా క వటం మొదలెడితే, అప్పటికే కండలు బైటికొచ్చిచస్తున్న నాపని ఖాళీఅయ్యేదే!

ఇంతలో మోటారుసైకిళ్ళమీద ఇద్దరుజర్మన్లువచ్చారు వాళ్లు రావటంతోటే కొరడాలతో మాట్లాడటం మొదలెట్టారు. అలా కొట్టికొట్టి అలసిపోయి, చివరకు ఆ దగ్గర్లో వున్న క్యాంప్‌కు లాక్కెళ్ళారు. రక్తం కారుతూన్న నా బోసి వళ్లు, వాళ్లు ఈడ్చుకెళ్తుంటే ఎంత బాధపెట్టిందో చెప్పలేను. పారిపోవటానికి ప్రయత్నించినందుకుగాను వాళ్లునన్ను "ఒంటరికైదు"లో నెల్లాళ్ళవుంచారు. "ఒంటరికైదు" అంటే జైలు లాటిదికాదు. అదొక యమపురి—ఎవరూ ఊహించలేనంత ఘోర నరకకూపం. అలాంటికూపంలో నెల్లాళ్ళుండి, తిరిగి ప్రాణాలతో బైటపడ్డానంటే ఆ దేవుడే ఆశ్చర్యపోతాడు సోదరా!!

నేను ఖైదీగావున్నప్పుడు పొందిన అనుభవాల్ని తలుచుకుంటే ఏడుపొస్తుంది. ఆ జర్మనీవాళ్లు పెట్టిన హింసలకు గురై, ఎంతోమంది చచ్చిపోయారు. ఆ చిత్రహింసల్ని తలుచుకుంటేనే చాలు గుండె బ్రద్దలౌతుంది సోదరా...

ఒక క్యాంప్‌నుంచి ఒకక్యాంపుకు, ఒకజైలునుండి మరో జైలుకు తిప్పి, యించుమించుగా సగం జర్మనీఅంతా తిప్పారు నన్ను. నేను 'శకోస్సెనా'లోవున్నా. 'రూరర్' గనిలో బొగ్గు తవ్వాను. బవేరియాపొలాల్లో బండ్లకొద్ది మట్టితవ్వాను.

ఒకటేమిటి? ఆ జర్మనీలో నేను చెయ్యనిపనిలేదు. ఆ ముండా కొడుకులు చేసిన దారుణాలకు లెక్కేలేదు. చేతుల్లో ఏముంటే వాటితో పొడుస్తూ, ఇష్టమొచ్చినచోటల్లా బూట్లతో తంతూ, నోటికొచ్చినట్లల్లా బూతులుతిడుతూ, వాళ్ళుపెట్టిన యమ యాతనలు తలుచుకుంటే గుండె ఆగినంతపనవుతుంది. ఆ రాక్షసులు నిర్దయగా, కాలుస్తూంటే హాహాకారాలుచేస్తూ కొన్నివేలమంది నేలకొరిగిన దృశ్యాలు తలుచుకుంటే, చలి జ్వరం వచ్చినట్టు వళ్ళంతా వణుకుతుంది...

అది అంత ఘోరం సోదరా! దాన్ని వర్ణించి చెప్పడం నా తరంకాదు.

నువ్వు రష్యన్‌వి అయినంతమాత్రాన నిన్ను కొట్టే వారు...నువ్వింకా బ్రతికున్నందుకు చిత్రహింసలు పెట్టేవారు. వాళ్లు చెప్పినవైపు నువ్వు తిరగకపోయినా, వాళ్లవైపు అదోలా చూసినా నాపని ఖాళీయే. అలావుండేది ఆ పరిస్థితి.

ఇంక తిండిసంగతి నేను వేరే చెప్పనక్కర్లేదు. ఎక్కడికెళ్ళినా అదేరొట్టె పెట్టేవారు. రొట్టె అంటే ఏమోఅనుకునేవ్. రంపపుపొట్టు. ఏదో పదిరకాలపిండి కలపినచెత్త. ఎక్కడో ఒక్కొక్కచోట పొరపాటున వేడినీళ్ళిచ్చారు. సాధారణంగా చన్నీళ్లే...చలిలో ఆనీళ్లు తాగలేక చచ్చేవాళ్ళం—కొన్ని సమయాల్లో ఆ నీళ్ళుకూడా కరువొచ్చేది. ఇవన్నీ ఎందుకు? ఒక్కవిషయం చెప్తావిను. యుద్ధంలోకి రాకముందు నా బరువు 86 కిలోగ్రాములు. తర్వాతచూస్తే 50 కి తక్కువే. దాన్నిబట్టి నువ్వే ఊహించుకో. అప్పట్లో నావంట్లో ఎముకలు, చర్మం

తప్ప మరేంలేదు. అసలు ఆ ఎముకలగూడును లాగటానికైనా బలం ఉన్నట్టుండేదికాదు. అయినా నోరుమూసుకుని చచ్చినట్టు పనిచెయ్యాల్సిందే. ఆరోజుల్లో మేంచేసేపని, బఱ్ఱెల్లాగే దున్నలుకూడా చేయలేవంటే ఆశ్చర్యంకాదు!

సెప్టెంబరునెల వచ్చింది. 'కుస్ట్రిన్'కు దగ్గర్లోవున్న క్యాంప్‌నుంచి మాలో 140 మందిని బి-14 క్యాంప్‌కు పంపించారు. అది 'డ్రెస్‌డెన్'కు దగ్గర్లోనే వుంది. ఆ క్యాంప్‌లో సుమారు రెండువేలమందివరకూ వుండేవారు. మేం అంతా, ఆ జర్మన్ బండరాళ్ళను తవ్వి, బద్దలుకొట్టి పనిచేసేవాళ్ళం—ఒక్కొక్కడూ రోజుకి, నాలుగు క్యూబిక్ మీటర్లలో పనిని పూర్తిచెయ్యాలి. విన్నావా? ఒక్కొక్కడూ రోజుకు నాలుగు క్యూబిక్ మీటర్లు—అంటే రోజూ చచ్చి బతకడమన్న మాట. నిజంగానే అలాజరగటం మొదలైంది. రెండు నెలల్లో మా నూటనలభై మందిలో ఏభైఏడుగురం మిగిలాం—అంటే ఆ మిగతా ఎనభైముగ్గురూ, ఆ రాళ్ళపాలే నన్న మాట...ఛ. ఆఘోరాన్నంతా చూస్తూ ఎలా సహించగలిగామో ఆ దేవుడికే తెలియాలి...చెప్తే నువ్వు నమ్మవేమో కాని బ్రదర్—చచ్చిపోయినవాళ్ళను కప్పెట్టేందుకు కూడా మాకు అవకాశం దొరికేదికాదు. ఇది ఇలావుండగా, రేగిన పుండుమీద కారం జల్లినట్లుగా క్యాంపులో ఓ పుకారు పుట్టింది. జర్మన్లు 'స్టాలిన్‌గ్రాడ్'ని పట్టుకుని సైబీరియాలోకి తరుముకెళ్తున్నారని—దాంతో వాళ్ళ పొగరు మరీ ఎక్కువైపోయింది. మమ్మల్నసలు, కళ్లెత్తయినాచూడనిచ్చేవారుకారు. మేం వాళ్ళకేదో పుట్టుకనించే బానిసలైనట్టుగా చూసేవారు. ఆ వార్త

వచ్చినప్పట్నుంచీ వాళ్ళ సంతోషానికి అంతేలేదు. రోజూ తప్పతాగటం, పాటల్లాంటివి అంగక అరుస్తూ. రోడ్ల రోలర్లలాగ కిందపడి దొర్లటం తప్ప మరోపని వుండేదికాదు వాళ్ళకి—మా పరిస్థితి యెప్పటికంటే ఘోరంగా తయారైందని నే వేరే చెప్ప నక్కర్లేదు.

ఎప్పటిలాగే ఆ రోజుకూడా పని అయిన తర్వాత, సాయంత్రమయ్యేటప్పటికి గూటికి చేరుకున్నాం. ఆ పగలంతా విడవకుండా వర్షం కురుస్తూనే వుంది—అయినా మాకు తప్ప దుగా. సాయంత్రమయ్యేటప్పటికి ముద్దయిపోయింది...దానికి తోడు చలిగాలికూడా యెక్కువగా వుండటంతో మా పరిస్థితి చెప్పలేనంత 'ఇది'గా వుంది...ఒకమూల గజగజ వణికించే చలి, మరోవైపు చెప్పలేనంత ఆకలి—మాకు సాయంకాలం తిండిపెట్టరు. అప్పటిబాధ భరించటంకంటే చావటమే కొన్ని వేల రెట్లు నయమనిపించింది.

చిరాకుతో తడిబట్టలుతీసి, ఒకమూలకు గిరాటు వేశాను. ఆ కడుపుమంటలో నాకు తెలియకుండానే "రోజుకి నాలుగు క్యూబిక్ మీటర్లు తవ్వమంటారు కాని, మనం చావ టానికి, ఒకటికూడా ఎక్కువే" అన్నాను. అంతేనుమా నే నన్నది...మాలోనే ఒకవెధవ...చెప్పడానికి నాకే సిగ్గేస్తోంది, నేనన్న యీ మాటలు తీసుకెళ్ళి, క్యాంప్ కమాండంట్ చెవిలో ఊదాడు.

క్యాంప్ కమాండంట్‌ని జర్మన్లు 'లాగర్ ఫ్యురెర్' అంటారు. వాడిపేరు 'ముల్లెర్' కొంచెం పొడుగ్గా, లావుగా

వుంటాడు. వాడికళ్లూ, కనుబొమ్మలు, జుత్తూ అన్నీ చూస్తే చాలు అసహ్యం వేస్తుంది. అంతా మాడిపోయినట్టుగా వుంటుంది. వాడు మనలాగే మాట్టాడుతాడు రష్యన్‌ని. వాడు రష్యన్ మాట్టాడుతూంటే 'ఓల్గా' ప్రాంతాలవాడేమో ననిపిస్తుంది. క్యాంప్ అంతకి వాడంటే హడల్. వాడిదగ్గర ఛలేకటుకులున్నాయిలే...మమ్మల్నందర్నీ క్యాంప్ బైట వరుసగా నిలబెట్టిన తర్వాత వచ్చేవాడు—కుడిచెయ్యి వెనక్కిపెట్టుకొని లైనుముందు నడుస్తూ, ఒక్కొక్కడి ముఖంమీద ఒక్కొక్క బలమైన గుద్దు ఇచ్చేవాడు—అలా కొడుతున్నప్పుడు, వేళ్లు నొప్పిపెట్టకుండా చేతికి తోలు 'కవర్'లాంటిది తొడుక్కునేవాడు. క్యాంప్‌లోవున్నవాళ్ళందర్నీ, నాలుగుబ్యాచీలుగా విడదీసి ఒక్కొక్కబ్యాచీకి, ఒక్కొక్కరోజు అలా చేసేవాడు వెధవ. ఒక్కరోజుకూడా తప్పకుండా చేసేవాడు. అందుకే వాడంటే అందరికి అంతభయం. వాడలా కొట్టేముందు రోజూ నోరు నెప్పిపెట్టేవరకూ తెగతిట్టేవాడు. ఆ తిట్టేదంతా రష్యన్‌లోనే తిట్టేవాడుకనుక, అదేమిటోమరి, మాకు ఏమంత బాధనిపించేదికాదు. నాలోనే ఒకడు తిడుతున్నట్టుగా వుండేది—

నేనలా అన్న మరుసటిరోజే కమాండంట్ దగ్గర్నుంచి నాకు పిలుపొచ్చింది. కమాండంట్ నన్నెందుకు పిలిచాడో నే నూహించాను. అదే నాఆఖరురోజు. అందుకే మావాళ్ళందరికీ 'గుడ్‌బై'చెప్పి, 'గార్డు'లవెనుక బయల్దేరా. అలా నడుస్తూ వెళ్తూంటే, ఛటుక్కున నాభార్యాపిల్లలు గుర్తుకొచ్చి నామీద

ఆశలుపెట్టుకున్న వాళ్ళగతి ఏమౌతుందోనని భయంతో కంపించిపోయాను. ఒక్కక్షణం చావంటే ఎందుకో భయం కలిగింది. కాని తిరిగి నాలో ధైర్యం తలెత్తింది. చావంటే భయపడితే, శత్రువుకెంత లోకువ. ఛా. అందుకే భయపడకూడదు. వీరసైనికుడనై, ధైర్యముగా చావాలనుకున్నా— అదే నిశ్చయంతో కమాండెంట్ గదిలో అడుగుపెట్టా. మా 'క్లబ్బు'ల్లోలాగే, ఆగది కిటికీలలో పువ్వులకుండీలున్నాయ్. వాటిలోని పువ్వులు మంచిఅందంగా వున్నాయ్. గదిమధ్యలో ఒకరౌండుటేబిలుంది. దానిచుట్టూ 'క్యాంపు'లోని ఆఫీసర్లంతా కూర్చున్నారు. వాళ్ళల్లో అయిదారుగురు అక్కడున్నవి తింటున్నారు. ఆ టేబిల్మీద సీసానిండాసారావుంది. ఇంకా ప్లేట్లలో బోలెడన్ని రొట్టెలు, ఘుమఘుమలాడే మాంసం, ఆపిల్పండ్ల ముక్కలూవున్నాయ్. ఇంకా ఏమేమోవున్నాయ్. అలాంటి ఆహారంచూసి ఎన్నాళ్ళయిపోయిందో, నానోరూరటం మొదలెట్టింది. దానికితోడు ఘోరమైన ఆకలి—కడుపు మండిపోతూన్నా, అలాటి ఆహారాన్ని చూస్తూ తినలేకుండా వుండవలసివచ్చినందుకు, నా కళ్ళల్లో నీళ్లు తిరిగాయ్...ఎలాగో కష్టపడి, నా దృష్టిని ఆ టేబుల్నుండి తప్పించా...

నాకెదురుగుండానే కూర్చున్నాడు ముల్లెర్. వాడి వాలకం చూస్తే తాగినట్టుగానే వున్నాడు...పిస్టల్ని ఒక చేతులోంచి మరోచేతిలోకి ఎగరేస్తూ, కొరివిదయ్యంలా నా వేపు చూస్తున్నాడు. నేను 'అటెన్షన్'లో నుంచుని "హెర్

కమాండెంట్ యుద్ధఖైదీని నాకోలాకేసి, అజ్ఞ సెలవీయండి” అన్నా గట్టిగానే. “అరేయ్ రష్యన్ గాడిదా! నీకు నాలుగు క్యూబిక్ మీటర్లు ఎక్కువగదా? కాదా?” అని అరిచాడు వాడు. “హెర్ కమాండెంట్...ఆ మాట నిజమే” అన్నాను ధైర్యంగా. వాడికి కోపమొచ్చినట్టుంది “నిన్ను పూడ్చటానికి ఒక్కగొయ్యి చాలా” అని అరిచాడు పందిలాగా... “చాలా ఎక్కువ హెర్ కమాండెంట్, ఇంకా మిగిలిపోతుంది” అన్నా ఏమాత్రం జడవకుండా.

వాడు లేచి అంటున్నాడు “అంత ధైర్యంగా మాట్లాడినందుకు నీకు గౌరవనీయమైన చావునిస్తా. నేనే స్వయంగా ‘షూట్’చేస్తా. ఇక్కడైతే ఛండాలమౌతుంది. బైటకునడు” “మీయిష్టం” అన్నాను నేను. వాడలాగే నుంచుని ఒకనిమిషం ఆలోచించాడు. తర్వాత, ఒకగ్లాసునిండా సారాపోశాడు. ఒక రొట్టెముక్కమీద మాంసం కొంతవుంచాడు. “చచ్చేముందు మా జయంకోరి ఇవితిను”అని అంటూ అవన్నీ నాకందించాడు అవి తీసుకునేవాణ్ణి. కాని వాడన్నమాటలు వినగానే, నా లోనే నన్నెవరో నరుకుతున్నట్టయింది—నేను, ఒక రష్యన్ సైనికుణ్ణి. జర్మన్ విజయంకోరటమా, అది నాప్రాణం పోయినా జరగనిపని—

వాడందించినవి టేబిల్‌మీద పెట్టేస్తూ, “మీ దయకు చాలా ‘థాంక్స్’ హెర్ కమాండంట్, నేను తాగను” అన్నాను. వాడు నవ్వుతూ “మా జయంకోరి తాగనన్న మాట. సరేపోస్లే. నీ చావుకోరేతాగు” అన్నాడు. అలా

అయితే నాకేం పోయింది. "నా ఆత్మశాంతికోసం" అంటూ ఆ సారాని రెండుగుక్కల్లో తాగేశా. కాని రొట్టె ఒకటుకు ముట్టుకోలేదు. చేత్తో పెదవుల్ని తుడుచుకుని "నేను రెడీ హెర్ కమాండంట్—నడవండి బైటకు వెళ్దాం" అన్నాను తడుముకోకుండా.

వాడు నా కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తూ "చచ్చే ముందు కాస్త రొట్టె తిను" అన్నాడు. కాని "ఒకగ్లాసు తాగినవెంటనే నేను తినను" అన్నాను. వాడు ఇంకో గ్లాసుడు పోశాడు. అది తాగాను. కాని రొట్టె తినలేదు. నా ఉద్దేశ మేమిటంటే చచ్చేముందు బాగా తాగితే, ఆ మైకంలో హాయిగా చావొచ్చని, అందుకని అలాగే నిలబడ్డా. క్షణం తర్వాత "అదేం తినవేం? అరే తినరా మొద్దుపీనుగా. సిగ్గుపడకు" అన్నాడు వాడు అదోలా చూస్తూ. "క్షమించండి హెర్ కమాండంట్—నేను రెండోగ్లాసు తర్వాత కూడా తినను" అన్నాను నెమ్మదిగా...దాంతో వాడు పగలబడినవ్వటం మొదలెట్టాడు—నవ్వుతూనే, నేనన్నది తక్కిన వాళ్ళకి వాళ్ళభాషలో చెప్పినట్టున్నాడు—వాళ్లుకూడా విరగబడి నవ్వటం మొదలెట్టారు. వాళ్ళ నవ్వులతో ఆ గదంతా మారుమ్రోగింది.

కమాండంట్ మరోసారి సారా పోశాడు. అది తాగేసి చిన్న రొట్టెముక్కమాత్రం తిన్నా. ఎంత ప్రాణంపోయే సమయంలోనైనా సరే దిగజారిపోకుండా, రష్యన్లు తను వ్యక్తి

ప్రాణాన్ని నిలబెట్టుకోంటానని ఆ జర్మనులకి చూపించాలనే అలా చేశా. అలా చేయగలిగినందుకు నిజంగా గర్వించానుకూడా.

మరో నిమిషం తర్వాత కమాండెంట్ టేబిల్ వెనక నుంచి నా దగ్గరకువచ్చాడు. "మాయిం సొకోలోవ్—నువ్వు నిజమైన రష్యన్ సైనికుడివి. నువ్వు వీరసైనికుడివి. నేనూ సైనికుణ్ణే. శత్రువైనాసరే చేవవుంటే నేను మెచ్చుకుంటా. అందుకని నిన్ను 'షూట్' చెయ్యను. మాకేం మా సైన్యాలు 'స్టాలిన్ గ్రాడ్'ని పట్టుకుని 'ఓల్గా'ని సమీపించాయ్. ఆ సంతోషంలో నీ ప్రాణం దానంచేస్తున్నా. ఇదిగో నీ ధైర్యానికిది తీసుకుని వెళ్లు" అంటూ వాడు నాకొకరొట్టె, కొంచం మాంసం ఇచ్చాడు...

నా ఆనందానికి పట్టపగ్గాల్లేవు. ఆ సంతోషంలోనే ఆ రొట్టెను నా గుండెకదుముకుని ఒకచేత్తో మాంసం పట్టుకుని 'థేంక్స్' చెప్పటంకూడా మర్చిపోయి వెనక్కుతిరిగా... తిరిగి అనుకోనివిధంగానే చావు తప్పినందుకు ఆశ్చర్యపోతూ ఆ గదినుండి బైటపడ్డా...

బైట నడుస్తున్నానన్న మాటేకాని, కళ్లుతిరగటంవల్ల నాకేదీ సరిగా కనబడటంలేదు. నేను మా గుడిశెదగ్గరి కెళ్లేసరికి నాలోని శక్తి పూర్తిగా అయిపోయింది. గుడిశెలోకి వెళ్ళిన కొద్దిక్షణాల్లోనే పడిపోయా. అంతే తర్వాత ఎప్పుడో మెలకువ వచ్చింది—మా కుర్రాళ్ళంతా నా చుట్టుముట్టారు—అప్పటికింకా చీకటిగానేవుంది. ఏంజరిగిందో చెప్పమని వాళ్ళంతా నన్ను కొరుక్కుతిన్నారు. జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పా.

చెప్పినంతసేపూ, అందరూ ఆశ్చర్యంతో చలనంలేకుండా బొమ్మల్లా వుండిపోయారు. తర్వాత ఒకడు 'రొట్టెను పంచే దెట్లా' అని అడిగాడు—'అందరికీ సమానభాగాలు' అని చెప్పా—వెలుగువచ్చేవరకూ ఆ భాగోతమే చెప్పుకుంటూ కూర్చున్నాం. తర్వాత, ఆ రొట్టెను, మాంసాన్ని కోశాం... ఒక్కొక్కడికీ, అగ్గిపెట్టెంత రొట్టెముక్కా. పెదవులకంటు కునేంత మాంసం వచ్చాయ్...అయినా మేం అంతా సంతృప్తిచెందాం...

వెంటనే కొన్నాళ్ళతర్వాత, మాలో బలమైన 300 మందిని, ఒకకాలువ త్రవ్వటానికి పంపించారు. అక్కడినుంచి "రూహర్" గనుల్లో పనిచేయటానికి పంపించారు. 1944 వరకూ నేను అక్కడేవున్నా. ఈ లోపున జర్మనీలో కొంత భాగం మనవాళ్లు జయించారు. దాంతో మా ఖైదీలనందర్నీ బాధపెట్టడం తగ్గించారు. ఒకరోజున మా అందర్నీ వరసగా నిలబెట్టి, యుద్ధంలోగాని యుద్ధానికిముందుగాని డ్రైవరుగా పనిచేసినవాళ్లు ముందుకురమ్మని 'లెఫ్టినెంట్' పిలిచాడు. అప్పుడు నాతోబాటు ఏడుగురం ముందుకొచ్చాం. మమ్మల్ని వెంటనే 'పోట్సుడామ్'కి తీసుకెళ్ళి, అక్కడనుంచి అందర్నీ తలొకచోటుకి పంపించారు. 'టోడ్ట్'శాఖలో పనిచేయటానికి నన్ను పంపించారు. రోడ్లువేయటం మొదలగు రక్షణకు సంబంధించిన పన్లు చేయటం ఆ శాఖపని.

ఇంజనీర్లందరి మీదున్న మేజర్ దగ్గర డ్రైవర్‌గా పని చేశా. వాడు పొట్టిగావుంటాడు—పెద్దబానంత బొజ్జ. చాకలి

మూటంత వీపు చూస్తూంటే, వాడొక గున్న ఏనుగులా వుంటాడు. వాడిగడ్డం మూడుభాగాలుగా చీలి, మూడుగడ్డా లున్నట్టు కనిపిస్తుంది. ఆనపకాయలాటి వాడిమెడ ముడతలు పడి చూడటానికి అసహ్యాంగా వుంటుంది. ఎలాలేదన్నా వంద కిలోగ్రాములకంటే ఎక్కువబరువే వుంటాడు. ఇంక వాడు తినటానికి కూర్చున్నాడంటే గంటలతరబడి తింటాడు. అసలు యెప్పుడూ ఏదోఒకటి నముల్తూనే వుంటాడు. ఫ్లాస్కులో పోసుకుని వుంచుతాడు బ్రాందీ. అది అస్తమానం తాగుతూనే వుంటాడు. రోడ్డుమీదపోతూ ఎక్కడైనా ఆపమని, రొట్టె, మాంసం, తిని బ్రాంది బాగాతాగేసి, పొరపాటున యెప్పు డైనా దయగలిగితే కుక్కకు పారేసినట్టు ఒకరొట్టెముక్క నాకు గిరాటువేస్తాడు. ఎప్పుడూ నా చేతికిచ్చిన పాపాన పోలేదు. అలా చేతికిస్తే, వాడిగౌరవానికి లోటేమో! పోన్లే. ఎలా అయితేనేం, అక్కడ నాకు కొంచం మంచితిండే దొరక టంవల్ల, నాకుకూడా కండపట్టడం మొదలైంది. కొన్నాళ్ళ లోనే, తిరిగి నా బలం నాకు చేరింది.

ఆ విధంగా వాడిదగ్గర రెండువారాలు 'డ్రైవ్' చేశాను. ఆ రెండువారాల్లో 'పోట్సుడామ్'కు బెర్లిన్‌కు మధ్య చాలాసార్లు తిరిగాం. తర్వాత ఆ మేజర్ని, రక్షణసౌకర్యాలు కలిగించమని 'ఫ్రంటులైన్'కి పంపించారు-అంటే మనవాళ్ళకు చాలా దగ్గర్లోవున్నానన్నమాట. అప్పుడుచూడు నా అవస్థ. రాత్రుళ్లు నిద్రపట్టేదిగాదు. మనవాళ్ళదగ్గరకు ఎలాగా పారి పోవటమని...

తర్వాత ఒకసారి మేం, 'పోలోట్స్కి' పట్టణానికి వెళ్లాం. రెండుసంవత్సరాల తర్వాత మొట్టమొదటిసారిగా అక్కడ మనవాళ్ళ సైన్యనినాదం విన్నాను. అప్పుడు నా ఆరాటం ఎంతగా వుండివుంటుందో నువ్వే ఊహించుకో— 'ఇరీనా'ని విడిచిపెట్టినప్పుడుకూడా నేనంత ఆరాటపడలేదనే చెప్పాలి. 'పోలోట్స్కి' పట్టణానికి సరిగ్గా 18 కిలోమీటర్ల దూరంలోనే యుద్ధం జరుగుతోంది. ఎప్పుడు ఉపద్రవం ముంచుకొస్తుందో అని జర్మనీవాళ్ళంతా భయపడి ఛస్తున్నారు. ప్రాణాలుగ్గబెట్టుకుని కాలం గడుపుతున్నారు. మా బొజ్జమేజర్ గాడుకూడా హడలిపోతున్నాడు. పగలంతా తిరగటం, ఎలా ఎలా పనిచెయ్యాలో అందరికీ చెప్పడం, రాత్రంతా ఇంటిదగ్గర కూర్చుని తెగతాగటం వాడిపని. వాడు ఎడతెరపిలేకుండా తాగుతుండటంవల్ల, తనేం చెపుతున్నదీ తనకే తెలీటంలేదు. పారిపోవటానికింతకన్నా మంచి అవకాశం దొరుకుతుందా? నేనొక్కణ్నే పారిపోతే ఏంవుంది? మా 'బొజ్జగాణ్ని'కూడా తీసికెళ్తేనే వుంది మజా. వాడు మనవాళ్ళకు బాగా ఉపయోగిస్తాడు—

పాడైపోయిన హాటిల్లోంచి ఒక మాంచి ఇనపకడ్డీ ఒకటి తీసుకున్నా. దానితో వాణ్ని కొడితే రక్తం అంటుకోకుండా దానికి గుడ్డచుట్టేశా. టెలిఫోన్ వైర్‌లోంచి, కొంత వైర్ తీశా, అవన్నీతీసి ముందు నేనుకూర్చునే సీటుకింద పెట్టేశాను. నేను పారిపోవటానికి రెండురోజులుముందు నేను ఇంటికొచ్చేస్తున్నప్పుడు దార్లో బాగాతాగేసి వెళ్తున్న ఒకజర్మన్‌ని

చూశా. వెంటనే వాణ్ని ఆ పక్కనున్న పాడుబడ్డ బంగళా లోకి తీసుకపోయి వాడి 'యూనిఫారం' తొలగించేసి, నా సీటు క్రింద భద్రంగా దాచేశా. దీనితో నేను పూర్తిగా రెడీ అయి పోయానన్నమాట.

అది జూన్ నెల. ఆరోజు 29 వ తారీఖు. ఆ ప్రొద్దున్న 'క్రోనిటాన్' క్యాంపు పోతున్నామని మా మేజర్ చెప్పాడు. అక్కడ జరుగుతున్న కదలికకు సంబంధించినపనులకు బాధ్యుడతను. సరే మేం బయల్దేరాం. మేజర్ వెనకసీట్లో కూర్చుని తాగిన మైకంలో, కునికిపాట్లు పడుతున్నాడు—నేను ముందుసీట్లో కూర్చుని, కారుని అతివేగంగా నడుపుతున్నాను...పట్నం దాటగానే 'స్పీడు' తగ్గించి. కొంతదూరంపోయాక కారు నాపాను. కిందికు దిగి చుట్టూ చూస్తే, మాకు వెనకాల చాలాదూరంలో రెండు లారీలు నెమ్మదిగా వస్తూ కన్పించాయ్—వెంటనే ఇనుపకడ్డీ తీసుకుని, వెనక తలుపు బార్లా తెరచాను వాడు గురకపెట్టి సుఖంగా నిద్రపోతున్నాడు. వాడికి ప్రక్కలో పెళ్లాంవున్నట్టే వుందేమో! సరే, ఇనుప కడ్డీతో వాడి కణత మీదఒకటి మోదా. ఎందుకైనా మంచిదని ఇంకో దెబ్బకూడా కొట్టా. వాణ్ని చంపడం నాకు ఇష్టంలేదు. ఎందుకంటే వాణ్ని బ్రతికుండగా అక్కడికి తీసి కెళ్తే మనవాళ్ళకి బాగా ఉపయోగిస్తాడు. సీటు వెనకాల ఒక కడ్డీపడేసి, దానికి వాడి మెడని టెలిఫోన్ వైర్‌తో గట్టిగా కట్టేశాను. ఎందుకంటే నేను 'స్పీడ్'గా 'డ్రైవ్'చేస్తే వాడు క్రిందకు జారిపోకుండా వుండాలని—జర్మన్ 'యూనిఫారం'

తోసుకున్నాని, ఆ టోపీ పెట్టుకుని మరీ తోశాను. యుద్ధ భూమివైపు దూసుకుపోయింది మా కారు.

జర్మన్ 'ఫ్రంట్ లైన్'లోకి వచ్చేసింది మా కారు. అక్కడ సబ్ మిషన్ గన్నర్స్ ఒకగోతిలోవుండి షూట్ చేస్తున్నారు. నా దగ్గర ఒక సెకనున్నా కని వాళ్లె చూశారని కావాలనే స్పీడు తగ్గించా—వాళ్ళను దాటిపోయింది కారు. అలా వెళ్ళటం ప్రమాదకరం అని వాళ్ళరుస్తున్నారు. అదెక్కడా వినిపించుకోలేదు. 'స్పీడ్' పెంచా—నలభై, యాభై, అరవై, డెభై, ఎనభై మైళ్ళ స్పీడులో 'రాకెట్'లాగా దూసుకుపోతోంది మా కారు—ఆ జర్మనులకు నేను చేస్తున్నదేంటో అర్థం అయి, కాల్పులు మొదలెట్టేసరికే, నేను ఎవరికీ చెందని భూమిలోకి వచ్చేశాను. అయినా వాళ్లు కాల్పులు మానలేదు. దానికితోడు మా కారునిచూసి గాభరాపడి ముందు నుంచి మనవాళ్ళుకూడా కాల్పులు చేయటం మొదలెట్టారు.

నాలుగు బులెట్లు రేడియేటర్లో దూరిపోయాయ్. దగ్గర్లోనే చెట్లు, అక్కడే చిన్న చెరువుకనిపిస్తే చెట్లలోకిపోనిచ్చా. ఆ చెట్లలోంచి మనవాళ్లు మా వైపుకు పరుగెత్తుకొచ్చారు. చెట్లలోకి వెళ్ళగానే కారు తలుపుతీసి క్రిందపడిపోయా. మన భూమి తగలగానే నాకు కలిగిన ఆనందం ఎంతో నేను చెప్పలేను.

ఒక యువకసైనికుడు నాదగ్గరకొచ్చాడు. అతన్ని అంతకుముందెప్పుడూ నేను చూడలేదు. "ఓహో జర్మన్ దయ్యమా? ఏం! దారితప్పి వచ్చావా?" అని ఇంకా

ఏమేమో అంటున్నాడు. నా జర్మన్ 'యూనిఫారం' చింపేసి, టోపీ అవతలపారేసి "తమ్ముడూ! 'ఒరునెజ్'లో పుట్టి పెరిగిన నేను జర్మన్ దెయ్యాన్నెట్లా అవుతాను బాబూ? చూడు నన్ను యుద్ధంలో ఖైదీగా పట్టుకపోయారు. ఆ కార్లో వుందాక జర్మన్ దెయ్యం—వెళ్లి వాణ్ణి పట్టుకో—ఈ విషయాన్ని మీ కమాండర్‌కి తెలియచేయ్" అంటూ నా 'పిస్టల్'ని అతని అధీనం చేశా. ఆ సాయంత్రం 'డివిజన్' కర్నల్ దగ్గరకు వెళ్లే లోపల ఒక్కొక్కళ్ళనే చాలమందిని కల్సుకోవాల్సివచ్చింది. వెళ్లగానే కొన్నిప్రశ్నలు వేశారు. తర్వాత స్నానాలగదికి తీసుకెళ్లి మంచిభోజనంపెట్టి కొత్త 'యూనిఫారం' ఇచ్చారు. అందుకనే సాయంత్రం కర్నల్‌దగ్గరకు శుభ్రంగానే వెళ్ళ గలిగా.

నేను కర్నల్ గదిలోకి వెళ్ళగానే, కర్నల్ స్వయంగా టేబిల్‌దగ్గర్నుంచి లేచి, తిన్నగా నా దగ్గరికివచ్చి అందరి ఎదురుగుండానే 'షేక్‌హేండ్' ఇచ్చి ఏమన్నాడో తెల్సా? "సొకోలోవ్ నువ్వు తెచ్చిన మంచి బహుమతికి చాలా థ్యాంక్సు. ఆ మేజరూ వాడితో వున్న పెట్టె మాకు చాలా విషయాలే చెప్పాయ్. నువ్వు చాలా శ్రమపడ్డావు. ఇంక నువ్వు కొన్నాళ్లు విశ్రాంతి తీసుకోవచ్చు—" అతని మాట ల్లోని ప్రేమ, ఆప్యాయత నన్నెంతగా సంతోషింపచేశాయో నే చెప్పలేను సోదరా! వణుకుతున్న పెదవులతోనే "కామ్రేడ్ కర్నల్! 'రైఫిల్' యూనిట్‌లో పనిచేయటానికి నన్ను పంపండి" అన్నా—

కాని కర్నల్ నవ్వుతూ నా భుజం తట్టి "భలేవాడివే నయ్యా. కాళ్ళలో బలం లేకపోయినా, శరీరంలో శక్తి లేక

పోయినా యుద్ధానికి తయారంటూన్. యుద్ధంలేదు, ఏమీలేదు. ఇక్కణ్ణుండి నీవు తిన్నగా ఆస్పత్రికి వెళ్తావు. నీ గాయాలు తగ్గి మనిషిగా తయారయ్యేవరకూ అక్కడే వుంటావు. తర్వాత ఒక నెల్లాళ్ళ సెలవు తీసుకొని మీ వూరు వెళ్లి విశ్రాంతి తీసుకుంటావ్. ఆ తర్వాత ఇక్కడి కొస్తావ్. అప్పుడాలోచించి నీకు తగినపని ఇస్తాలే—" అన్నాడు.

కర్నల్‌తోబాటు, తక్కిన ఆఫీసర్లంతా కూడా నాకు 'షేక్‌హాండ్లు' ఇచ్చి నాకు 'గుడ్‌బై' చెప్పి పంపించారు. రెండుసంవత్సరాల తర్వాత, తిరిగి మనిషిగా చూడబడినందుకు ఆ రోజు నా మనసు ఎవరూ ఊహించలేనంతగా ఆనందించింది.

నేను హాస్పిటల్లో చేరినవెంటనే ఇరీనాకు ఒకవుత్తరం వ్రాశాను. ఆ వుత్తరంలో మొదట నేను ఖైదీగా ఎలా పట్టుబడ్డదీ, తిరిగి ఆ మేజర్‌తో సహా ఎలా పారిపోగలిగిందీ అన్నీ క్లుప్తంగా తెలియచేశా. ఆ సంతోషంలో కుర్రాళ్లలాగా కొన్ని కోతలుకూడా వ్రాశాను. నీతో అబద్ధం చెప్పడం ఎందుకూ? కర్నల్ నాకు 'మెడల్' ఇప్పిస్తానని వాగ్దానం చేసినట్టుగా వ్రాయటానికికూడా నేను జంకలేదయ్యా. అదంతా ఇప్పుడు తలుచుకుంటే భలే తమాషాగా వుంటుందిలే.

రెండువారాలవరకూ నా పని తినటం, పడుకోవటమే—నాకు కొంచెం కొంచెం ఆహారం పెట్టేవారు. నేను కోరినట్టుగాని, చాలా ఆహారం యిచ్చినట్టయితే, బాగుండడం పోయి, పరిస్థితి ఘోరంగా మారేదని డాక్టర్ అనేవాడు—రెండు వారాలు అయినతర్వాత, వాళ్ళు నాకు ఆహారం ఇచ్చినా

సయించేదికాదు. కారణం ఇంటి దగ్గర్నుంచి జవాబు రాకపోవటమే. నిజం చెప్పాలంటే ఆ కారణంగా నేను చాలా డీలా అయిపోయా. తిండిమీద దృష్టిపోయేదే కాదు. ఎంత ప్రయత్నించినా నిద్రవచ్చేదికాదు—ఏవేవో వేధన ఆలోచనల్తో బుర్ర వేడెక్కిపోయేది. మూడోవారంలో మటుకు 'ఒరునెజ్'నుంచి నాకొక ఉత్తరం వచ్చింది. కాని అది 'ఇరీనా' నుంచి కాదు. నా పొరుగింటి అతను వ్రాసినది—నా గర్భ శత్రువుకూడా అలాటి వుత్తరం రాకూడదు సోదరా! జర్మనులు ఆ గ్రామంలోని విమానాశ్రయంమీద బాంబులు వేసినప్పుడు, ఒక పెద్దబాంబు నా గుడిశెమీద పడిందట—ఆ బాంబు పడినప్పుడు ఇరీనా, పిల్లలూ ఇంట్లోనే వున్నారంట—ఆ తరువాత ఇరీనాగాని, పిల్లలుగాని జాడేలేరంట. ఏం చెప్పను సోదరా! నా గుడిశె వుండాల్సిన చోటులో ఇప్పుడొక లోతైన గొయ్యి వుందట! మొదట అసలా వుత్తరాన్ని చదవలేకపోయా. నా నడుములో ఏదో నెప్పివచ్చినట్టయి అలాగే మంచంమీద వాలిపోయాను. తర్వాత మళ్లీ కాస్సేపటికి ఎలాగో ఓపిక తెచ్చుకుని వుత్తరం చివరికంటా చదివా—ఆ వుత్తరంలో ఇంకేముందంటే...బాంబింగ్ జరిగినప్పుడు, నా పెద్దకొడుకు 'ఆంటోలీ' టౌనులో వున్నాడంట. వాడు సాయంత్రం ఇంటికివచ్చి జరిగినది తెల్సుకుని, తిరిగి ఆ రాత్రే పట్నానికి వెళ్లిపోయాడు. వెళ్ళేటప్పుడు తను సైన్యంలో చేరిపోతున్నా అనిమాత్రం చెప్పి వెళ్లాడంట. అంతే. ఆవుత్తరంలో అంతకన్నా ఇంకేమీలేదు. నాగుండెల్లో రక్తం గూబల్లో పరు

గ్తొంది...ఆ నాడు 'ఇరీనా' స్టేషన్లో నన్ను కౌగలించుకున్న దృశ్యం కళ్లకు కట్టినట్టయింది...ఈ ప్రపంచంలో తిరిగి కలుసుకోలేనని అప్పుడే ఆమె ఊహించింది. అందుకే ఆమె అలా క్రుంగిపోయింది. అది నేను గుర్తించలేక, రాక్షసుడిలా ఆమెను తోసేశాను. ఒకప్పుడు నాకూ పచ్చని కుటుంబం ఉండేది. చక్కని ఇల్లు వుండేది. ఎన్నో సంవత్సరాలు కష్టపడితే ఆ యిల్లు కట్టుకోగలిగాను. నా సర్వస్వం ఒకక్షణంలో రూపుమాసిపోయింది...నేను ఏకాకినైపోయా. అదంతా ఒక కలై వుండాలి. శ్రమపడి సంపాదించుకున్న నా సర్వస్వం ఒక కలై వుండాలి—నేను ఖైదీగావున్న రెండుసంవత్సరాల్లో, ప్రతీ క్షణం నా ఇరీనా, నా పిల్లలూ స్మృతిపథంలో నిలచేవారు. నేను తిరిగి ఇంటికి వచ్చేస్తాననీ, తిరిగి అందరూ సుఖంగా వుండొచ్చనీ, అనుక్షణం వాళ్లకు ధైర్యం చెప్పేవాణ్ణి. దానికి వాళ్లు ఆనందించి నవ్వుతూ నన్నూ నవ్వించేవారు—అయితే అదంతా అబద్ధమేనన్నమాట! రెండుసంవత్సరాలుగా చచ్చిపోయినవాళ్ళతోనే మాటాడానన్నమాట! అబ్బ ఆ అనుభూతులు గుర్తుకొస్తే మతిపోతుంది సోదరా—ఒక్కొక్కప్పుడు పిచ్చయినా ఎక్కకూడదా, అవన్నీ శాశ్వతంగా మర్చిపోవచ్చు అనుకుంటా—ఏంటో సోదరా—జీవితం—" అంటూ అతను ఆగిపోయాడు—గాఢంగా నిట్టూర్చి "నా బుర్రంతా వేడెక్కిపోయింది సోదరా—పొగతాగితేనే గాని తిరిగి పనిచేసేలా కనబడటంలా" అంటూ సిగరెట్ అంటించాడు. అతనితోబాటే నేనూ సిగరెట్ ముట్టించి, గట్టిగా దమ్ములాగి పీల్చి,

గాలిలోకి పొగ వదలాను—ఆకాశంలో వేగంగాపరుగిడుతున్న మబ్బుల్నిచూస్తూ, అలాగే రెండునిమిషాలు నిశ్శబ్దంగా గడిపేశా...ఇహ వుండబట్టలేక "తర్వాత ఏమైంది?" అని అడిగాను—"తర్వాత ఏమైంది" అంటూ ఇష్టం లేకపోయినా తిరిగి మొదలెట్టాడు తన కథని. "తర్వాత కర్నల్ నాకు ఒకనెల సెలవు ఇచ్చాడు. ఒకవారంరోజుల తర్వాత నేను 'ఒరునెజ్'కు బయల్దేరా...ఒకప్పుడు నా పచ్చని సంసారంతో వుండే ప్రదేశానికి కాలినడకనే వెళ్లాను. అక్కడొక మురికిగుంట వుంది. దానిచుట్టూ ఏవేవో పిచ్చిచెట్లు లేచివున్నాయ్. ఆ చుట్టుపక్కలంతా శ్మశానంలా వుంది. అది చూస్తే, నాకు భోరున ఏడుపొచ్చింది. ఇంకక్కడ ఒక్కక్షణం వుండలేకపోయా. అదేరోజు తిరిగి 'డివిజన్'కు చేరుకున్నా...

మబ్బుల్లోంచి వచ్చే సూర్యకాంతిలాగ సుమారు మూడునెలల తర్వాత నాకు బ్రహ్మానందం కలిగించే వార్త వచ్చింది. నా ఆంటోలీ బ్రతికేవున్నాడు—ఇంకొక 'డివిజన్' నుంచి వాడు నాకు ఉత్తరం వ్రాశాడు. నాకు ఉత్తరం వ్రాసిన పొరుగింటి అతని ద్వారా వాడు నా అడ్రస్సు తెలుసుకోగలిగాడు. మొట్టమొదట 'ఆర్టిలరీ' కాలేజికి వెళ్లాడంట. అక్కడ వాడిలెక్కలు బాగా వుపకరించాయంట. ఒకసంవత్సరం అయిన తర్వాత వాడు పరీక్షల్లో ఫస్టుగా ప్యాసయి ఫ్రంటుకి వెళ్ళాడంట. వాడు నాకు ఉత్తరం వ్రాసే సమయానికి వాడు నల్లభై అయిదుగురుండే ఒకదళానికి కెప్టెన్‌గా పనిచేస్తున్నాడంట. పైగా వాడికి ఆరు 'ఆర్డర్లు' ఒక 'మెడల్' బహుమతిగా

ఇచ్చారంటకూడా. ఒక్కమాటలో చెప్పాలంటే ముసలి తండ్రిని వెనక్కి నెట్టేసి వాడు చాలా ముందుకు పోయేడన్న మాట. చూస్తూండగానే నా కొడుకింతవాడైనందుకు, నే నెంతో గర్వించాను. నువ్వేమైనా చెప్పు. నా కొడుకు ఒక 'కేప్టన్', ఒకదళానికి 'కమాండర్' అంటేమాటలా? అందులో ఆ 'మెడల్స్' కూడా. వాడితండ్రి ఒకసాధారణ సైనికుడైనంత మాత్రాన వాడికి పోయిందేముంది? అదంతా గతం. ఇప్పుడు తనొక కెప్టెన్. కమాండర్. తనకెంత భవిష్యత్తుంది? !!

రాత్రుళ్లు నాకు ముసలాళ్ళకొచ్చే కలలు అదేపనిగా రావటం మొదలెట్టాయ్. యుద్ధం అయిపోయిన వెంటనే వాడికి పెళ్ళిచేసి, వాడి పిల్లలతో కులాసాగా వుంటాననీ, ఏదో కాస్త వడ్రంగిపనిచేస్తూ, కుర్రాళ్ళను చూసుకుంటూ వుండిపోతాననీ ఇంకా ఏమిటేమిటో అన్నీ అలాటికలలే. కాని అలా ఆట్టే కాలం జరగలేదు. చలికాలం వచ్చేటప్పటికి, మా దళం అదే పనిగా ముందుకు పోవటం మొదలైంది. అప్పుడు మాకు ఒక్క క్షణంకూడా తీరికవుండేదికాదు. అలా కొన్నాళ్ళు, మేం ఇద్దరం తరచూ ఉత్తరాలు వ్రాసుకునే అవకాశం లేకుండాపోయింది. కాని యుద్ధం ఆఖరయ్యేరోజుల్లో మేం 'బెర్లిన్'కు దగ్గరగా వున్నప్పుడు ఆంటోలీకి ఒక ఉత్తరం వ్రాశా. ఆశ్చర్యం! ఆ ఉత్తరానికి మర్నాడే జవాబొచ్చేసింది. చిత్రమేమిటంటే, వాడూ, నేనూకూడా జర్మనీ ముఖ్యపట్టణానికి వేరువేరు మార్గాల్లో చేరుకున్నాం. ఇద్దరం అంత దగ్గర్లోవున్నందున, ఎప్పుడు కలుసుకుంటామూ అన్న ఆతృత క్షణక్షణానికి ఎక్కు

వయ్యేది. నేను వేచివుండిన క్షణం రానేవచ్చింది. మే తొమ్మి దవతారీఖు. ఆ రోజే రష్యా విజయాన్ని సాధించింది...ఆ ప్రొద్దున్నే, ఒక జర్మన్ ముండాకొడుకు నా కొడుకుని పొట్ట బెట్టుకున్నాడు.

ఆ మధ్యాహ్నం మా కమాండర్ నన్ను పిలిచాడు. అతనితోబాటు ఒక కొత్త 'ఆర్టిలరీ' ఆఫీసరుకూడా కూర్చు న్నాడు. ఏదో తనకన్నా పెద్ద ఆఫీసరొచ్చినట్టు, నేను గదిలోకి వెళ్ళగానే అతను లేచి నుంచున్నాడు. మా కమాండర్ 'సొకొలోవ్! అతను నిన్ను కలవటానికి వచ్చాడు' అని కిటికీ వైపు తిరిగిపోయాడు. ఏదో ఆపత్తు రాబోతోందని అనుకున్నా. వెంటనే కరెంట్ 'షాక్' తిన్నట్టయింది. ఆ లెఫ్టినెంట్‌కర్నల్ నా దగ్గరకొచ్చి "మీ కొడుకు—కెప్టెన్ సొకొలోవ్ ఇవాళ చనిపోయాడని చెప్పటానికి చాలా విచారిస్తున్నానండి! ధైర్యం చిక్కబట్టుకుని నాతోరండి" అన్నాడు.

అదివినగానే నా తల దిమ్మెత్తిపోయింది. ఆ తర్వాత జరిగిందేదీ నాకు స్పష్టంగా గుర్తులేదు. నేనూ, ఆ లెఫ్టినెంట్ కర్నల్, ఆ పెద్దకార్లోవెళ్తూ వీధుల్లోచూసిన దృశ్యాలంతా కలలో చూసినట్టుగావుంది. ఎర్ర సిల్కుగుడ్డ కప్పబడ్డ ఆ శవం ముందు సైనికులంతా వరసగా నిలబడ్డారు. ఇప్పుడు నిన్ను చూసినంత స్పష్టంగానే నా ఆంటోలీనికూడా చూశాను సోదరా. ఔను నేను శవందగ్గరకు వెళ్లాను. అక్కడున్నది నా కొడుకే. కాని ఆంటోలీ కాదు. నా ఆంటోలీ చిన్నకుర్రాడు. ఎప్పుడూ నవ్వుతూ, నవ్వితే బుగ్గలుసొట్టపడి ముద్దొచ్చే

కుర్రాడు. కాని, అక్కడున్నది కండలుతిరిగిన అందమైన యువకుడు...అతను సగం మూసినకళ్ళలో, నాలోపెక్కడో ఏ భాగాన్నో తరచితరచి చూస్తున్నట్టనిపించింది. అతని పెదవుల మీద చిరునవ్వు సరిగ్గా నా ఆంటోని నవ్వులాగే వుంది... ఔను. వాడే నా ఆంటోని, ఒక్కసారి ముద్దెట్టుకుని ప్రక్కకు తొలగిపోయా. లెఫ్టినెంట్ కర్నల్ ఏదో ఉపన్యసించాడు. వాడి స్నేహితులంతా కళ్ళనీళ్ళు తుడుచుకుంటున్నారు. నేను ఏడవలేకపోయా సోదరా...ఏడవలేకపోయా ...నా కళ్ళల్లో నీళ్ళులేవు. అవి ఏనాడోనాగుండెలో”నే ఇంకిపోయాయి. అందుకే సోదరా ఆ దృశ్యం నన్నీనాటికి అంత ఘోరంగా తినేస్తుంది. నా తుది కోర్కె అంతటితోనే అంతం అయిపోయింది. అతని దీర్ఘ ప్రయాణానికి వీడ్కోలు చెపుతూ సైన్యం ఫిరంగులు పేల్చింది. ఎవరో నాలోనే ఫిరంగి పేల్చినట్టయింది. తర్వాత నేను నేనుగా మా 'యూనిట్'కి వెళ్ళలేకపోయా. నేను చచ్చిపోయా. అయినా నా శరీరం బ్రతుకుతోంది. అంతే, ఆ తర్వాత సైన్యం లోంచి నాకు విముక్తి కలిగింది. ఎక్కడకు వెళ్ళను? 'ఒరునెజు'కా? ఎందుకూ? పాడుబడ్డ ఆ గోతిని చూచుకోడానికా? 'ఉర్స్యాపిన్స్క్'లోని ఒకమిత్రుడు ఎప్పుడో, నన్నువచ్చి అతనితో వుండమన్నాడు. అది గుర్తుకొచ్చింది. సరే అక్కడికి వెళ్ళాను.

పాపం, నా మిత్రుడికి పిల్లల్లేరు. అతనూ, అతనిభార్యా వాళ్ళు స్వంతంగా కట్టుకున్న గుడిశెలో వుంటున్నారు. అతనికేదో కొంత 'పింఛను' వస్తుంది. అదిచాలక ఒక లారీడిపోలో

క్లీనర్‌గా పనిచేస్తున్నాను. అక్కడే నాకుకూడా వుద్యోగం వచ్చింది. నేను వాళ్ళింట్లోనే వుండేవాణ్ని. ఇద్దరం వేర్వేరు లారీలను నడిపి, రాత్రికి ఇంటికి చేరుకునేవాళ్ళం. ఈ కొత్త కొడుకు నాకు అక్కడే దొరికాడు. సాధారణంగా దూర ప్రయాణంచేసి, వచ్చినవెంటనే ఏదైనా తినాలని హోటలుకు వెళ్తావ్. అన్నిటికంటేముందు, అలసట తీర్చుకోటంకోసం ఒక గ్లాసుడు 'ఓడ్కా' తాగుతావ్. ఏం అలాచూస్తావ్? నీకలవాటు లేదా? ఏమోమరి! నేనుమాటుకు దానికి చాలా ఘోరంగా అలవాటుపడ్డాలే. ఒకరోజున ఈ కుర్రాణ్ని అక్కడ చూశా. మళ్ళీ మర్నాడుకూడా చూశా. నూనె రాయకపోవటంవల్ల పీచులాటి వాడిజుట్టు కళ్ళల్లో పడుతూండేది. వాడిముఖంనిండా మట్టి కొట్టుకుపోయి నల్లగా మాడిపోయివుండేది. వాడికళ్లు లోతుకుబోయి జాలిగొలిపేట్టుండేవి. అయినా వాడిచూపులో ఏదో వెలుగుంది. వాడు చిన్ననోరువిప్పినవ్వితే ముత్యాలు రాలినట్టుగా వుండేది. నవ్వినప్పుడు వాడిముఖంచూస్తే, ఎంత ముద్దొచ్చేదనుకున్నావ్! అందుకే వాణ్ని రోజూ చూడాలని పించేది. రోజూ వాణ్ని చూడటంకోసం, పనికూడా త్వరగా పూర్తిచేసుకుని ఆ కాఫీహోటల్‌కు చేరుకునేవాణ్ని. ఆ కాఫీ హోటల్‌మెట్లే వాడి నివాసం. వాళ్లూ వీళ్లూ పెట్టేదే వాడి భోజనం.

ఆ నాలుగో రోజున, 'ఫారం'నుంచి లారీలోవస్తూ, తిన్నగా హోటల్ ఎదురుగానే ఆగాను. వాడు ఆ మెట్లమీద కాళ్లూపుతూ కూర్చున్నాడు. వాణ్నిచూడగా మహా ఆకలిగా

వున్నట్టున్నాడు. కిటికీలోంచి నాతల బైటకుపెట్టి పిలచాను. "హా వన్యా! ఇక్కడకురా, సరిగ్గెత్తుకురా. ఎలివేటర్ దాకా వెళ్ళి తిరిగినద్దాం. మళ్ళీవచ్చి భోంచేద్దాం." నా పిలుపు వినగానే, వాడు ఒక్కపరుగులో నాదగ్గరకు వచ్చాడు. కిటికీవైపు తలెత్తి, కళ్ళు పెద్దవిచేసి, అదోలా చూస్తూ "నా పేరు వన్యా అని నీ కెలా తెల్సు?" అని అగిగాడు.

అన్నీ తెల్సినవాళ్ళలో నేనుకూడా ఒకణ్ణని వాడితో అన్నా...వాడు చుట్టుతిరిగి, కుడిచేతివైపు కొచ్చాడు. నేను తలుపు తీశా. వాడు లోపలకొచ్చి నాపక్కన కూర్చున్నాడు. వెంటనే మా లారీ కదిలింది. భలే తమాషాఅయినవాడులే వాడు...ఏం మాట్లాడకుండా అలాగే కూర్చుండిపోయాడు. అస్తమానం నావైపు చూస్తూ, నిట్టూర్చటం మొదలెట్టాడు. అంత కుర్రకుంక అప్పుడే నిట్టూర్చటం నేర్చాడు......అలా చేయొచ్చా వాడు? "వన్యా! మీ నాన్న ఎక్కడున్నాడు?" అని అడిగాను. "యుద్ధంలో చచ్చిపోయాడు" అన్నాడువాడు. "అమ్మ?" "రైలులో వస్తూంటే, బాంబుపడి చచ్చిపోయింది" అన్నాడు. "రైల్లో ఎక్కణ్ణుంచి వస్తున్నారు.?" అని మళ్ళీ అడిగాను. "నాకు తెలీదు". "ఇంకెవరూ చుట్టాలేరా?" "ఊహు, ఎవ్వరూ లేరు" అన్నాడు వాడు బుర్రాడిస్తూ. "అయితే మరి నువ్వెక్కడ పడుకుంటావ్?" "ఎక్కడపడితే అక్కడ" అన్నాడు.

వాణ్ణి చూస్తూంటే నా గుండె తరుక్కుపోయింది. ఎందుకిలా ఒంటరిగా వుండాలి? వీణ్ణెందుకు పెంచుకోకూడదు?

ఈ విధమైన ఆలోచనలు నా బుర్రలోకి రావటంతో, నాలో ఏదో తెలియని ఆనందం కలగసాగింది. వాడివైపు వంగి "నాన్నా! నే నెవరో తెల్సా?" అని అడిగా. వాడలాగే చూస్తూ "ఎవరూ?" అన్నాడు అమాయకంగా. "నేనే మీనాన్నను" అన్నాను.

అప్పుడేం జరిగిందో తెల్సా? నా మెడచుట్టూ చేతులు వేసి, అమాంతంగా నా పెదవులు, కళ్లూ, బుగ్గలూ, నోరూ, ఒక టేమిటి అన్నీ, అదేపనిగా ముద్దెట్టుకోటం మొదలెట్టాడు. అంతటితో వదలకుండా "నాన్నా, నాకు తెల్సు నువ్వొస్తావని. ఎక్కడున్నా వెతుక్కుంటూ వస్తావని నాకు తెల్సు నాన్నా!" అంటూ నన్ను కరుచుకుపోయాడు. ఆనందంతో నాకళ్లు చెమ్మగిలి, దారి కనబడకుండా పోయింది. నా చేతులు వణుకుతున్నాయ్. 'స్టీరింగ్'ని ఎలా పట్టుకోగల్గానో నాకే తెలీదు. అయినా భయమేసి, ఇంజన్ ఆపేశాను. నా కొత్తకొడుకు, ఇంకా నన్ను కరిచిపెట్టుకునే వున్నాడు. అయిదు నిమిషాలు అక్కడే వున్నాం. వాడింకా అలానే వున్నాడు. నా కుడిచేత్తో వాణ్ని పట్టుకుని, ఎడంచేత్తో స్టీరింగ్ పట్టుకుని, తిన్నగా ఇంటికి దారితీశా. అప్పుడు ఎలివేటర్‌కు వేళ్లాల్సిన సంగతే మర్చిపోయా.

గేటుదగ్గరే లారీ ఆపేసి, నా కొత్త కొడుకుని ఎత్తుకుని లోపలికెళ్లా. వాడు, నా చెంపలకు వాడి బుగ్గల నానించి, నా మెడను రెండు చేతుల్తో గట్టిగా పట్టుకుని వేళ్లాడుతున్నాడు. ఆ సమయానికి నా మిత్రుడూ, అతనిభార్యా ఇద్దరూ ఇంట్లోనే

వున్నారు. వాళ్ళనుచూసి ధైర్యంగా చెప్పాను. "ఆఖరికి నా చిన్నకొడుకు వన్యాను ఈవాల్టికి కనుక్కోగలిగాను" అని నేను అనగానే వాళ్లు కనుక్కోగలిగారు. పిల్లల్లేని కారణంగా పాపం, వాళ్ళకు నా కొడుకుని చూసేటప్పటికి ఎంతో ముద్దేసింది. నా మిత్రుడి భార్య నా కొడుకుని తీసుకోబోయింది. నేను ఓ పట్టాన విడవలేకపోయా. తర్వాత వాడిచేతులు సబ్బుతో కడిగి, టేబిల్ దగ్గర కూర్చోబెట్టా. నా మిత్రుడి భార్య, వాడికి ఒక పళ్లెంలో కొంత టిఫిన్ పెట్టింది. అది వాడు రెండు క్షణాల్లో తినేశాడు. వాణ్ని చూస్తే ఆమె గుండె పగిలినట్టయింది. కళ్లల్లో నీళ్లు నిలిచాయ్. అదిచూసి వన్యా ఆమె దగ్గరకెళ్ళి ఆమె కళ్లల్లోకి చూస్తూ "ఏడుస్తావెందుకు పిన్నీ? నాన్న ఇవాళ నన్ను తీసుకొచ్చినందుకు నవ్వాటంపోయి, ఏడుస్తావేం?" అని అమాయకంగా అడుగుతుంటే ఆమె దుఃఖం పొంగిపొరలింది. ఆపుకోలేక వెక్కివెక్కి ఏడ్వటం మొదలెట్టింది...పాపం! స్త్రీ హృదయం!

అన్నం తిన్నాక, వాణ్ని మంగలిసాపుకు తీసుకెళ్ళి 'క్రాప్' చేయించాను. తర్వాత నేనే స్నానంచేయించి, శుభ్రమైన తువ్వాలుతో తుడిచాను. నా మెడచుట్టూ చేతులువేసి, అలాగే నిద్రపోయాడు వాడు. తర్వాత నెమ్మదిగా వాణ్ని పక్కమీద పడుకోబెట్టి, లారీ తీసుకుని ఎలివేటరుకు వెళ్ళి అక్కడనుంచి త్వరగా పని ముగించుకుని, బజారుకెళ్ళి వాడికొక జత ట్రౌజర్లు, ఒక చిన్నచొక్కా, ఒక జత జోళ్లు, ఒక చిన్ని టోపీకొని, గబగబ ఇంటికెళ్లా. తీరా చూస్తే అవేవీ వాడికి సరిపోలేదు. చివరికి "నీకేం పిచ్చెక్కిందా? ఇంత

ఎండలో అలాంటిపాంట్లు తొడిగితే వాడేం అవుతాడు?" అని మా స్నేహితుడిభార్య మందలించింది నన్ను. ఆవిడకు కుట్టుపని తెల్సునకనక వెంటనే రెండు మామూలు ప్యాంట్లు, ఒక తెల్ల చొక్కా కుట్టి సిద్ధంచేసింది నా వన్యాకు.

వాడితోబాటే నేనుకూడా పడుకున్నా. చాలాకాలం తర్వాత, మళ్ళీ సుఖంగా నిద్రపోవటం అదే మొదటిసారి. మొత్తంమీద నాలుగుసార్లు లేచాననుకో, అయినా నాకు హాయిగానేవుంది. వాడు నామెడకు మొలేసుకుని, పడుకుని మెత్తగా గాలి నా ముఖంమీదకు వదుల్తూంటే నేనెంత సౌఖ్యం అనుభవించానో చెప్పటానికి ఏ భాషలోని పదాలైనా చాలవ్ సోదరా...

రోజూ ఇంచుమించుగా అదేవిధంగా జరిగేది. ఆ ఆనందం లోనే గతంలో తగిలిన దెబ్బలన్నీ మరిచిపోగలిగేవాణ్ని...

మొదట్లో, నేను లారీనడుపుతోంటే వాడు నామీద స్వారీచేసేవాడు. అది కష్టమెందని గుర్తించాక వాణ్ని ఏదోలా మరపించి ఇంటిదగ్గరే వుంచాలని ప్రయత్నించా. అయినా కుదర్లే. మొత్తానికి ఎలాఅయితేనేం, తెగించి వాణ్ని ఆమెకు అప్పచెప్పి నేను పనిలోకి వెళ్లేవాణ్ని. వాడు పగలంతా ఏడ్చి, ఏడ్చి, సాయంకాలం అయేటప్పటికి ఎలివేటరు దగ్గరకొచ్చి నాకోసం కాచుకునేవాడు. అప్పుడిద్దరంకలసి ఇంటికొచ్చే వాళ్లం...

ఎప్పుడూ మేంఇద్దరం కలిసేపడుకునేవాళ్ళం. వాడెప్పుడూ నన్ను అంటిపెట్టుకునే పడుకునేవాడు. ఒకరోజున, నావైపు

అదోలా చూడటంమొదలెట్టాడు. ఏం అలా చూస్తున్నావంటే "నీ తోలుకోటు ఎక్కడపెట్టావ్?"అని అడిగాడు. అసలు నా కెప్పుడూ అటువంటికోటు లేదు. అయినా వాణ్ని సమాధాన పర్చటంకోసం, "'ఒరునెజ్'లో వదిలేశా" అని చెప్పా. వాడు అంతటితో ఊరుకోకుండా "నన్నిన్నాళ్ళవరకూ ఎందుకు చూళ్లేదు?" అని అడిగాడు. "లేదునాన్నా, నీకోసం అంతా వెతుకుతున్నా...జర్మనీ, పోలెండు, బైలోరష్యా అన్నీ వెతికితే, చివరకు 'ఉర్యుపిన్స్క్'లో దొరికావ్" అన్నా. "అయితే మరి 'ఉర్యుపిన్స్క్' జర్మనీకంటే దగ్గరా? అది పోలెండుకు మనింటికంటే దూరమా?" అని ఏవేవో అడిగేవాడు. అలాగే అడిగి అడిగి మగతకలగగానే నిద్రపోయేవాడు. వాడితోపాటే నేనూ కునుకు తీసేవాణ్ని.

అలా అసలు ఇంకో సంవత్సరంపాటు అక్కడేవుండే వాళ్ళం. కాని ఈలోపున ఒకప్రమాదం వచ్చింది...మట్టిరోడ్డు మీద ఒకగ్రామంలోంచి వచ్చేస్తున్నా. అలా వస్తూవస్తూ ఆ పక్కనేవున్న చిన్నగోతిలోకి వెళ్ళిపోయింది లారీ. అక్కడే ఒక ఆవు వుండటం తటస్థించింది. వెళ్ళి లారీ దాన్ని ఢీకొంది. దాంతో ఏహూతుందో నాకుతెల్సుగా. ఆడమళయాళం చేరి నన్ను హంగామాచేస్తుంటే, ఇంతలో ట్రాఫిక్ ఇన్స్పెక్టర్ వచ్చి నా డ్రైవింగ్ లైసెన్సుకాస్తా తీసుకున్నాడు. తీరాచేసి అంతా అయ్యాక, ఆ ఆవు తోకపైకెత్తి అక్కణ్నుంచి రంకె వేసింది. కాని ప్రయోజనం ఏంటి! నా లైసెన్సుకాస్తా పోయింది.

ఈమధ్య చలికాలంలో మళ్ళీ డ్రైవింగ్ మొదలెట్టా. ఈ లోపునే, సైన్యంలోని పాతమిత్రుడొకడు కన్పించాడు... అతను మా జిల్లాలోనే డ్రైవర్‌గా పనిచేస్తున్నాడు. నన్నతను తనదగ్గరికి రమ్మన్నాడు. మళ్ళీ ఒకసంవత్సరం పనిచేస్తే అప్పుడు లైసెన్సునిస్తుందన్నాడు. అందుకని ఇప్పుడు నేనూ, నాకొడుకూ, 'కషారీ' వెళ్తున్నాం. అతనుండేది అక్కడే.

అసలా 'ప్రమాదం' జరగక్కపోయినా, అక్కడ ఆట్టే కాలం వుండేవాళ్ళంకాదులే. ఎందుకంటే నాబాధలు ఎప్పుడూ గుర్తుకొచ్చి ఎక్కువకాలం ఒకేచోట వుండనీయవ్. ఇంక నా కొడుకు పెద్దవాడై, చదువుకెళ్లాల్సినస్తే అప్పుడు ఎక్కడో అక్కడ స్థిరపడక తప్పదులే. అంతవరకూ వీలైనంతవరకూ రష్యాఅంతా తిరుగుతూనే వుంటాం" అని అతను ఆగాడు.

"వాడు అలసిపోడా?" అని అడిగాను.

"అలసిపోవటానికేంవుంది? వాడెక్కువ నడవడు. ఎక్కువగా నామీద స్వారీచేస్తాడు. ఇంక వాడికాళ్లు తిమ్మిరెక్కితే, క్రిందకుదూకి లేడిలా ఇటూఅటూ పరిగెడుతాడు. అదేం పెద్ద కష్టంకాదులే సోదరా...ఎలాగోలా నెట్టేస్తాం. కాని వచ్చిన చిక్కేమిటంటే, వున్నట్టుండి ఎప్పుడో ఒకప్పుడు నా గుండెల్లో ఎవరో బాకు దిగేసినట్టుగా వుంటుంది. నేనెప్పుడో నిద్రపోతూ హఠాత్తుగా చచ్చిపోతే, నాచిన్నికొడుకు బెంగపెట్టుకుంటాడనే భయపడతా. దీనికితోడు మరొకటి. ఇంచుమించుగా ప్రతిరాత్రీ నన్నువిడిచి వెళ్లిపోయిన 'నా వాళ్ళంతా' కలల్లో కనిపిస్తారు. ఎక్కువగా ఒకటీగ. వాళ్ళంతా ఆ తీగకు అవతలవేపు,

నేనొక్కణ్ణే ఇవతల వేపు వున్నట్టుగా వస్తాయి కలలన్నీ. వాళ్ళతో మాట్లాడినంత సేపు వాళ్ళు కనుపించి, నేనాత్రిగను తీసేయటంతో వాళ్ళంతా కరిగిపోయినట్టు మాయమౌతుంటారు. ఇంకో చిత్ర మేమిటంటే, పగలంతా నేను బాగానే వుంటా....ఎక్కడా బాధగాని, బెంగకాని నాలో కనపడదు. రాత్రయితేనే అదంతా మారిపోతుంది. ఒకప్పుడు ప్రొద్దున్నే లేచి చూస్తే, నా తలగడంతా కన్నీళ్ళతో తడిసిపోతుంది..." అని ముగించాడతను.

ఒడ్డుకు సమీపిస్తున్న నా మిత్రుడి పిలుపు వినిపించింది. ఇంత తక్కువ కాలంలోనే, నాకు ఎంతో ఆప్తుడుగా దగ్గరైపోయిన ఆ ఆగంతకుడు లేచి నుంచుని, తన దృఢమైన మోటు చేతిని నావైపుచాచి. "గుడ్ బై సోదరా, వెళ్ళొస్తా" అన్నాడు.

"గుడ్ లక్, సుఖంగా వెళ్ళిరా" అన్నా, అతనితో కరస్పర్శ చేస్తూ.

"థాంక్స్, వస్తా. అబ్బాయ్...నడు నావ దగ్గరకెళ్దాం" అనేటప్పటికి ఆ కుర్రాడొచ్చి, అతని చొక్కా చివర పట్టుకుని అతని అడుగుల్లో అడుగులు కలుపుతున్నాడు. విభిన్న ప్రాంతాలకు చెందిన ఇద్దరు అనాధలు, బీభత్సయుద్ధంవల్ల ఆశ్చర్యంగా ఒక్కటయ్యారు. వారి భవిష్యత్తు ఎలావుందో...! దిటవు గుండెగల ఆ రష్యన్ వీరుడు చిరకాలం శక్తివంతంగా బ్రతికి, తన చిన్నారి కొడుకుని, దేశాని కుపకరించే ఒక నిస్వార్థ పౌరుడుగా తయారుచేయగల్గుతాడని మనస్ఫూర్తిగా ఆశించా.

వాళ్ళలా వెళ్తూంటే దిగాలుపడి చూస్తున్నా....వాళ్లు

మామూలుగా వెళ్ళిపోయుంటే బాగా నేవుండును. కాని, కాని,—ఆ చిన్ని వన్యా...కొన్ని అడుగులు దూరం వెళ్ళాక, వెనక్కి తిరిగితన చేతులు ఊపడం మొదలెట్టాడు...హఠాత్తుగా ఎవరో నాగుండెను పిసుకుతున్నట్టయి, నా బుర్ర అటువైపుకు తిప్పేసుకున్నా. దానికి అతనెంత బాధపడతాడో! నిజమే...యుద్ధంలోనే తమ జీవితం అంతా గడిపిన ఈ ముసలివాళ్లు బాధపడడమేకాదు; నిజంగా ఏడుస్తారు. ముఖ్యంగా లేచే సమయాల్లో ఎటొచ్చీ, అది చూడకుండా వుండగలగాలి. అన్నిటికన్నా ముఖ్యమైనది—తాతల చెక్కిళ్ళమీది ఆ వేడి కన్నీళ్ళను చూస్తే చిన్నిపిల్లల హృదయం తల్లడిల్లుతుంది. అందుకని వాళ్ళకా అవకాశమే కలగనీయకూడదు.



# ఉత్తమ నవలలు

| | | |
|---|---|---|
| మట్టి మనుషులు | (కాళిందీచరణ పాణిగ్రాహి) | 2.25 |
| పునరాగమనం | (బోరిస్ పోలెవోయ్) | 1.75 |
| మానధనులు | (హోవర్డ్ ఫాస్ట్) | 2.75 |
| స్పార్టకస్ | ,, | 4.50 |
| ఛంఘిజ్‌ఖాన్ | (తెన్నేటి సూరి) | 4.50 |
| ఉదయ కిరణాలు | (పోలుకూచి సాంబశివరావు) | 3.00 |

(పోస్టేజి అదనం)

ప్రతులకు :

విశాలాంధ్ర ప్రచురణాలయం,
బకింగ్‌హాంపేట (పోస్టు) : విజయవాడ.

Wrapper Printed at Swatantra art Printers, Vijayawada.